# ఆగమ మణిమంజరి

(వైఖానసాగమం)

డా॥ వేదాన్తం శ్రీవిష్ణుభట్టాచార్య
M.A., Ph.D.
తి.తి.దే. వైఖానస ఆగమ సలహాదారులు









ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఆగమమణిమంజరి

## (వైఖానసాగమం)

డా॥ వేదాన్తం శ్రీవిష్ణుభట్టాచార్య M.A., Ph.D.
తి.తి.దే. వైఖానస ఆగమసలహాదారు




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2005

**AGAMAMANIMANJARI**
**Telugu**

*by*

**Dr. Vedantham SriVishnu Bhattacharya,**
**M.A., Ph.D.**



T.T.D. Religious Publications Series No : 731

First Edition : 2005

Copies : 2,000



*Published by*
**A.P.V.N. SARMA, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 501

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati — 517 507

# ముందుమాట

భారతీయసంస్కృతి సంప్రదాయం పరంపరకు మూలభూతములైనవి వేదములు. ఇవి సాక్షాత్తు శ్రీమన్నారాయణుని యొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసాలని పెద్దలు చెబుతారు. ఉచ్ఛ్వాస నిశ్వాస రూపాలైన వేదాలు సర్వశాస్త్రాలకు సర్వధర్మాలకు ఆధారాలు.

మానవుడు తరించటానికి అవసరమగు జప-తప-అర్చనాది విధానం. వేదాలలో రూపకల్పన చేయబడి ఉంటే అద్దానిని జనబాహుళ్యానికి అవసరమగు విధంగా విస్తృతరూపంలో ఉపదేశింపబడినవి ఆగమశాస్త్రాలు. ఈ ఆగమశాస్త్రాలలో నిరాకారుడైన పరమాత్మకు ఆకారాన్ని కల్పించి ఆలయనిర్మాణ-ప్రతిష్ఠా-అర్చన-స్నపన-ఉత్సవ-ప్రాయశ్చిత్త విధానాలన్నీ క్రమపద్ధతితో సాంగోపాంగంగా ఉపదేశింపబడ్డాయి.

ఆగమాలు అనేకాలు ఉన్నప్పటికీ వైదికమార్గంగా రూపొందింపబడి, ఇహపరసుఖ సాధకంగా, విష్ణ్వర్చనయే మోక్షప్రాప్తికి ప్రధానమార్గమని నిర్ధారింపబడి, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు ఆనందనిలయవాసి అగు శ్రీశ్రీనివాసుని దివ్యసన్నిధానంలో అనూచానంగా సాంప్రదాయ పద్ధతితో నిత్యనైమిత్తిక అర్చనాది ప్రక్రియలతో అత్యంతవైభవోపేతంగా ఆచరింపబడుతూంది వైఖానసాగమం.

వైదికమార్గంగా నిర్ధారింపబడ్డ వైఖానసాగమంలో అవశ్యము తెలుసుకొనతగిన అంశాలు కోకొల్లలుగా ఉన్నాయి. వైఖానసాగమ సంబంధ ప్రాచీనగ్రంథాలనుండి ప్రధానములైన అంశాలను సేకరించి ఒకచోటచేర్చి అద్దానికి ఆగమమణిమంజరి అని నామకరణం చేసి గ్రంథరూపంలో వెలువరిస్తున్న తి.తి.దే. వైఖానసాగమ సలహాదారు డా॥ **వేదాన్తం శ్రీవిష్ణుభట్టాచార్య** అభినందనీయులు.

ఈ "**ఆగమమణిమంజరి**" గ్రంథములోని విషయాలను ఆస్తిక జనులు అధ్యయనంచేసి పరమాత్మునియొక్క దివ్య అనుగ్రహానికి పాత్రులు కాగలరని ఆశిస్తున్నాను.

ఆర్షసంస్కృతి సంప్రదాయ సంరక్షణకు ఈ గ్రంథం ప్రధాన దోహదకారి కాగలదని నా ఆకాంక్ష.

ఇట్లు
**ఎ.పి.వి.ఎన్. శర్మ**, ఐ.ఎ.యస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

తిరుపతి
**13-9-2005**

# అరచేతి వెన్నముద్ద

ఆదిమధ్యాంతరహితుడు, విరాట్ స్వరూపుడు అయిన ఆ శ్రీ వేంకటేశ్వరస్వామివారిని భక్తులు ఎన్నో విధాల అర్చిస్తారు. మానసపుష్పాలు అర్పిస్తారు. పుష్పార్చన చేసేవారు కొందరైతే, అన్నమయ్యలా అక్షరార్చన చేసేవారు కొందరు.

''ఎంతమాత్రము ఎవ్వరుదలచిన అంతమాత్ర''మయ్యే ఆ అలమేలుమంగపతికి అక్షరార్చన చేస్తున్నారు. **డా॥ వేదాంతం విష్ణుభట్టాచార్యులవారు**. ఆగమాలపట్లవారికి ఉన్నపట్టు, ప్రవేశం, అందరికీ తెలిసిందే. దేవస్థానం ఆగమసలహాదారుగా ఆయన కృషి కేవలం సలహాలకే పరిమితంకాక, సకల జనామోదరచనలకు విస్తరించడం ఆనందదాయకం.

ఆగమమణిమంజరి అన్న ఈ గ్రంథం ఆధ్యాత్మిక జ్ఞాన పిపాసులందరికీ అవశ్యపఠనీయం. ఒక విషయం స్థూలంగా తెలుసుకోవడంవేరు, వివరంగా విపులంగా తెలుసుకోవడం వేరు.

ఆ యా రంగాలలో నిష్ణాతులైనవారు వారి జ్ఞానాన్ని అక్షరీకరించి అందరికీ అందించాలి. అలాంటి గ్రంథాలు ఆనాటి వారికేకాక, భవిష్యత్తరాలకూ ఉపయోగపడతాయి. ఈ ఆగమమణిమంజరి నిస్సందేహంగా అలాంటిగ్రంథం.

నిజంగా ఇది ప్రతి ఒక్కరు చదవవలసిన గ్రంథం. విష్ణువు, విమానం, యజ్ఞం, ఆలయనిర్మాణం, ఆగమసూక్ష్మం, పూజావిధానం మొదలైన ఎన్నో విషయాల గురించి శ్రీవిష్ణుభట్టాచార్యులు ఎంతో విపులంగా, అధికారికంగా వివరించారు చిత్తానికి ఓ శాంతిమార్గం లభించే విధంగా ఈ పొత్తాన్ని వారు తీర్చిదిద్దటం విశేషం.

అతిక్లిష్టమైన విషయాలను అరచేతి వెన్నముద్దలా వివరించే ఇలాంటి గ్రంథాలు అరుదుగా వస్తాయి. అందుకే అందరూ ఆదరించాలి, చదివి ఆచరించాలి.

*శుభం భూయాత్*

''కవికోకిల''
పి. శైలకుమార్, ఎం.ఎ.,
సంపాదకులు,
తి.తి.దేవస్థానములు, తిరుపతి.

తిరుపతి,
19-9-2005.

# ఉపోద్ఘాతం

అనంతమైన జీవకోటికి అధినాథుడు, అఖిలచరాచర సృష్టికర్త, అనాదినిధనుడు అగు పరమాత్మ భక్తజనులను సంరక్షించదలచి వైకుంఠమును వీడి అర్చావమూర్తిగ ఆలయమునందు నివాస మేర్పరుచుకొని భక్తజనుడిగ భక్తజనబాంధవుడిగ గణుతికెక్కి ప్రత్యక్షదైవంగా భక్తజనుల హృదయాంతరాళాలలో సుస్థిరస్థానాన్ని ఏర్పరుచుకొన్నాడు.

అర్చామూర్తిగ ప్రసిద్ధికెక్కి ఆలయమునందు విరాజితు డగుచున్న పరమాత్మునకు ఆలయనిర్మాణ-విగ్రహ ప్రతిష్ఠా-అర్చన-స్నపన-ఉత్సవ-ప్రాయశ్చిత్తము లనెడి అంశములను ఉపదేశించుచూ పరమాత్మశక్తియుక్తులను ఒకచో స్థాపించుటకు, నేత్రములకు, మనస్సుకు, ఆనందాన్నిపంచి అచంచలత్వాన్ని స్థాపించటానికి హేతుభూతమైంది ఆగమశాస్త్రము.

పరబ్రహ్మను పరమాత్మను పొందింపచేయటానికి ఆర్ష సంస్కృతి సంప్రదాయపరంపరకు చిహ్నమై ఆధ్యాత్మికపుష్ప సుగంధాన్ని భక్తులకు అందించుటకుకూడా వీలైనది ఆగమశాస్త్రం. ఇది తంత్ర నామాంతరమైంది.

శ్రీమహావిష్ణువునకు కరచరణాది అవయవములను మృత్-శిలా-దారు-లోహాదులతో నిర్మించి ప్రతిష్ఠించుటను, అర్చించుటను గూర్చి ఉపదేశించునది వైష్ణవాగమము. ఇది ప్రధానంగా రెండు విధములు వైఖానసమని, పాంచరాత్రమని. ఇందు వైఖానసాగమము వైదికము సౌమ్యము అని, పాంచరాత్రము తాంత్రికము ఆగ్నేయము అని పిలువబడుచున్నవి.

వైదికార్చన ఇహపర సుఖసాధకముగా, తాంత్రికార్చన ఇహ సుఖసాధకముగా ప్రసిద్ధికెక్కినవి.

వైఖానసపాంచరాత్రములలో వైఖానస ఆగమశాస్త్రరీత్యా అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుడు అర్చామూర్తి అగు తిరుమల శ్రీ శ్రీ వేంకటేశ్వరస్వామిదివ్యసన్నిధానమునందు, పాంచరాత్ర ఆగమశాస్త్రరీత్యా శ్రీరంగంలోని శ్రీరంగనాథస్వామివార్ల ఆలయము నందు అనూచానంగా అర్చనోత్సవాదులు ఆ యా అనుష్ఠానకర్మలు నేడు వైభవముగా జరుగుచున్నవి.

**అర్చనావిధానం**

వైఖానసాగమంలో ఉపదేశింపబడ్డ అర్చన మూడు రకాలుగా ఉంటుంది.




ఆసనాద్యుపచారములు మనస్సుతోనే పరమాత్మునకు సమర్పించుట మానసికార్చన అని, అగ్నిని ప్రతిష్ఠించి ధ్యానించి ఆ అగ్నిద్వారా ఆజ్యచరు అపూపాదులను పరమాత్మునకు సమర్పించుట హోమంద్వారాఅర్చన అని, ఇదియే హోమపూజ అనికూడా పిలువ బడుతుంది.

పరమాత్మునకు లోహంతోగానీ దారువుతోగాని మట్టితోగాని కరచరణాదులు కల్పించి రాజోపచారములు నిర్వర్తించుచూ విశేషముగా అర్చించుట విగ్రహార్చన అనబడుతుంది. ఈ విగ్రహార్చన ఆలయార్చన, గృహార్చన అని రెండు విధములు. ఆలయార్చన పరార్థయజనము అని, గృహార్చన స్వార్థయజనము అనికూడా పిలువబడుతుంది.

మానసికపూజ-హోమపూజ-బేరపూజ(విగ్రహపూజ)లలో విశిష్టమైంది, మనస్సునకు నేత్రమునకు ఆనందదాయకమైంది, భక్తికి పరాకాష్ఠ అయినది, చంచలత్వనివారణకు, ప్రకృతిద్రవ్యములతో పూజోపయోగమైంది, ఆర్షసంస్కృతిసంప్రదాయపరిరక్షణకు నిదానభూతమైంది, కళావినియోగమునకు హేతుభూతమైంది. నాస్తికత్వ, భిన్నమర్యాద, మూఢత్వ, అజ్ఞానాదిదోషములనివారణకు సాధనమైంది విగ్రహ పూజ. సర్వాభీష్టములు పొంది జీవయాత్ర సుఖమయం చేసుకొనగలిగేందులకు కూడా ప్రధానమైంది ఈ విగ్రహ పూజ అని ఆర్షపండితుల కథనం.

విగ్రహారాధనకు ప్రధానస్థానము దేవాలయము. విగ్రహప్రతిష్ఠ లోకశాంతి రాజారాష్ట్ర సర్వజన శాంతినుద్దేశించి ఆలయమందే జరుపవలయును. ఈ ఆలయము ఐదురకములుగా ఉండునని కూడా వైఖానస ఆగమము చెప్పుచున్నది. దానిని పరిశీలిద్దాం.

## స్వయంవ్యక్తాది ఆలయములు

స్వయంవ్యక్తం, దివ్యం, ఆర్షం, పురాణం, మానుషమని ఆలయములు ఐదు రకములుగా విభజింపబడినవి.

పరమాత్మయే స్వయముగా భక్తులను అనుగ్రహించదలచి ఆవిర్భవించు ప్రదేశం స్వయంవ్యక్తం.

బ్రహ్మరుద్రప్రముఖులతో ప్రతిష్ఠింపబడింది దివ్యం.

ఋషులచే ప్రతిష్ఠితమైంది ఆర్షం

పురాణసిద్ధమైంది పౌరాణం

మనుష్యులచే ప్రతిష్ఠితమైంది మానుషం అని

***స్వయంవ్యక్తం సర్వలోకసమృద్ధిదం,***
***దైవికం శతయోజన పుణ్యదం,***
***ఆర్షం పంచయోజన ఫలప్రదం,***
***పౌరాణం యోజనత్రయ పుణ్యదం,***
***మానుషం యోజనాదర్వాక్ స్థిత జనానామేవ పుణ్యదం॥***

**వి.క 98 పటలం.**

స్వయంవ్యక్త ఆలయము సర్వలోకసమృద్ధిదమైనది.
దైవిక ఆలయము శతయోజన దూరము పుణ్యప్రదమైంది
*(యోజనం=76,800 అంగుళముల దూరము)*

ఆర్ష ఆలయము ఐదుయోజనములదూరము ఫలప్రద మైంది. పౌరాణ ఆలయము యోజనత్రయదూరము పుణ్యప్రదమైంది మానుషఆలయము యోజన దూరములోపల ఉన్న జనులకు పుణ్యమును కలిగించునదిగా అగుచున్నది.

*స్థాపకస్య తపోయోగాత్*
*అర్చనస్యాతిశాయనాత్।*
*అభిరూప్యస్య బింబస్య*
*త్రిధా సన్నిహితో హరిః॥*

ప్రతిష్ఠాపకుని యొుక్క తపోయోగమూ, అర్చనయొుక్క మహిమ, బింబముయొుక్క అభిరూప్యము ఈ మూడు పరమాత్మని సన్నిహితుని చేయుటకు తోడ్పడును.

ఈ మూడింటి చేత శ్రీ మహావిష్ణువు సన్నిహితుడగుచున్నాడు.

పరమాత్మని వైదిక మార్గమున విగ్రహార్చన చేయుటకు అనేక ఆగమోక్త అంశములు మనకు అవశ్యము తెలియవలసియున్నవి. అందులకుగాను శ్రీవైఖానసభగవచ్ఛాస్త్రమూలగ్రంథములను అధ్యయనము చేసి అందలి విశిష్ట విషయములను ఒకచో సంకలనము చేసి అద్దానికి "**ఆగమమణిమంజరి**" అని నామకరణం చేయటం జరిగింది.

ఈ "**ఆగమమణిమంజరి**" అనుగ్రంథమునందు నవరత్న సమానములైన తొమ్మిది ప్రధాన అంశములు కలవు. అందు ఒక్కొక్క అంశములో ఉపాంశములు వ్రాయబడినవి. మొత్తం అంశములు షుమారుగా నూరుకుపైగా సంకలనం చేయబడినవి. ఇవి ఆలయంలో ప్రవేశించే ప్రతిభక్తుడు మరియు ఆలయయజమాని, ఆచార్య, అర్చకులు, పాచకులు, పరిచారకులు, యజమానులు, భక్తులు అందరూ అవశ్యము గ్రహించతగినవి. అందు

**శ్రీ మహావిష్ణువు అను మొదటిఅధ్యాయమునందు** విమానము-విష్ణువు, విష్ణువిశిష్టత, నారాయణవైశిష్ట్యము, విమానార్చనవిశిష్టత, శ్రీమన్నారాయణుడుసర్వకారణభూతుడు విష్ణువుయొక్కవర్ణములు, విష్ణ్వాలయములేని ప్రదేశము నివాసమునకు అయోగ్యము, ప్రాఙ్ముఖవిమానము శ్రేష్ఠము, విష్ణ్వాది పంచమూర్తులు, మూర్తి-వేదసామ్యము, యజ్ఞము విష్ణువు, విష్ణువునకు శ్రేష్ఠభూమి, దశావతార పూజాఫలము, పరిషద్గణము పూజావిశిష్టత, భగవద్రూప విశిష్టత, పరమాత్మభక్తబంధువు, సద్వారకం-అద్వారకం అను 17 అంశములు వివరించబడినవి.

**ఆలయ నిర్మాణం అను రెండవ అధ్యాయము** నందు భూ పరీక్ష, వాస్తువిధానము - నవవిధప్రదేశములు, భారతదేశవిశిష్టత, ఆరామ తటాకాదులనిర్మాణఫలములు, గృహ ముఆవశ్యకత, ఆలయా లంకరణ, విష్ణ్వర్చనఫలితము అను 7 అంశములు ప్రతిపాదించ బడినవి.

**అర్చనా పూర్వంగం అను మూడవ అధ్యాయమునందు** ఊర్ధ్వ పుండ్రధారణ ఫలం, సంస్కారవములు రెండువిధవములు, గ్రహపూజ-సర్వదోషనివారణ, సహ ప్రచంద్రదర్శనం-బ్రహ్మశరీరం, ఆత్మయజ్ఞం, పుణ్యాహవాచనం, అర్చకసహాయకులు-పరిచారకులు, పంచమహాయజ్ఞవములు అను 8 అంశవములు సంకలనం చేసి వివరించబడినవి.

**ఆగవువములు అను నాల్గవ అధ్యాయువమునందు** విష్ణు తంత్రవములు, వైఖానసశాస్త్రవము, వైఖానసశాస్త్రవము విశిష్టత, వైఖానసుడు -విశిష్టత, తంత్రసంకరదోషం, తంత్రసంకర ప్రాయశ్చిత్తం, శాస్త్రాచరణ ఆవశ్యకత, ధర్మద్వారములు, క్షమాప్రార్థన, స్వయంవ్యక్త ఆలయు పూజావిశిష్టత, అర్చకుని నిత్యకర్మ, గాయత్రీ సావిత్రీ మంత్రములు, సావిత్రీ మంత్ర అధ్యయనఫలం, ఆలయం దైవశరీరం, ఆచార్యునకు ఆశౌచవిధానం, ప్రాచీన ఆలయ సంప్రదాయములు, సామ్ప్రతకల్పనం, బాలాలయం ఇటుకలతో నిర్మించకూడదు, అను 18 అంశములు నిరూపించబడినవి.

**పూజా విధానం అను ఐదవఅధ్యాయమునందు** మానసపూజ, విగ్రహ పూజ, విగ్రహ పూజావిశిష్టత, అగ్నిపూజ, సమారాధన నాల్గు విధములు, యోగం, ధ్యానం, సమాధి, జ్ఞానం-జ్ఞాతా-జ్ఞేయం, అర్చన విశిష్టత, పంచప్రణామములు, అమూర్తార్చనం, సమూర్తార్చనం, సమూర్తార్చనవిశిష్టత, సాకారనిరాకారఅర్చనలు, ప్రతిమార్చన విశిష్టత, పూజాంగములు, బలిపీఠ నిర్మాణఫలం, అను 18 అంశములు ప్రతిపాదింపబడినవి.

**అర్చనయజ్ఞఫలం అను ఆరవఅధ్యాయమునందు** పంచాగ్నులు -పంచబేరములు, త్రేతాగ్నులు-బేరత్రయము, స్థానకాసనాది విగ్రహములు-తత్ఫలములు, చక్రప్రతిష్ఠాఫలం, ఆవాహన-ఆవాహన విధానం, ప్రణవం, పవిత్రవిశిష్టత, ప్రతిమాఆవశ్యకత, ఉత్తమ బ్రహ్మవిద్య, అర్చనం-పరమోపాయం, ఉత్తమోత్తమం చతుష్షష్ట్యు పచార విధానం, నిర్గుణం-సగుణం, శుద్ధాన్న నివేదన ఫలము, అర్చన ఐదు రకములు, ఉపచారములు అనేకవిధములు, పాద్యం, దైవదర్శన ఫలం, బలి-యజ్ఞఫలం, అర్చనాఫలం, తీర్థవైశిష్ట్యం, తీర్థం-ప్రసాదం, షట్కాలార్చనలు తత్ఫలములు, ప్రదక్షిణవిధానము, పుష్పగంధాది దానఫలములు, పుష్పాదిదానఫలములు, దేవయాగ ఫలం, వివిధ ఉపచారవములు- వాటిఫలితవములు, నిత్యార్చనావిచ్ఛిన్నం- మహాదోషం, నిత్యార్చనం - అగ్నిహోత్రఫలం, పుష్పములు- ఉత్తమాది భేదములు, నిర్మాల్యములు, సువర్ణపుష్పములు, యవనిక ఆవశ్యకత, శ్రీస్వరూపం, లక్ష్మి రెండు విధవములు అను 35 అంశవములు వివరింపబడినది.

**ఉత్సవ ఫలం అను ఏడవ అధ్యాయమునందు** ఉత్సవ దర్శనం, ఉత్సవదర్శనఫలం, శాంత్యుత్సవం, ఉత్సవశబ్దార్థం, కాలోత్సవం, ఉత్సవఫలం, ఉత్సవంలో పంచద్రవ్యాలు, ధ్వజస్థగరుడనివేదన - సంతానప్రాప్తి అను 8 అంశముల వివరణ ఇవ్వబడినది.

**ప్రాయశ్చిత్తములు అను ఎనిమిదవఅధ్యాయమునందు** ప్రాయశ్చిత్తపదార్థం, అద్భుతములు, ప్రాయశ్చిత్త నిమిత్తములు అను 3 విషయముల ప్రతిపాదనజరిగినది.

**అపచారములు అను తొమ్మిదవఅధ్యాయమునందు 32** అపచారములు ప్రస్తావించబడినవి.

తిరుమల తిరుపతి దేవస్థానంవారిచే ప్రచురించబడుచున్న "**ఆగమమణిమంజరి**" అను ఈ గ్రంథములోని ఈ అంశములను అధ్యయనం చేసి పండితాదిపామరజనం ఆలయంయొక్క, ఆగమశాస్త్రంయొక్క అంతరార్థాన్ని, ఔన్నత్యాన్ని, విశిష్టాన్ని, గ్రహించి యథాశక్తి ఆయా ధర్మములను ఆచరించి పరమాత్మునియొక్క అనుగ్రహానికి పాత్రులు కాగలరని ఆశిస్తున్నాము.

శ్రీ వైఖానస సంబద్ధా
***ఆగమ మణిమంజరీ।***
***లిఖితా విష్ణుభట్టేన***
***రాజతాత్ విదుషాం హృది॥***

**తిరుపతి**
పార్థివ
గోకులాష్టమి

ఇట్లు
సుధీజనవిధేయుడు
**వేదాన్తం శ్రీ విష్ణుభట్టాచార్య**

# సంకేతాక్షరసూచి

| | | |
|---|---|---|
| 1. | ఉ.బ్రహ్మ. | ఉత్తమబ్రహ్మవిద్యాసారః |
| 2. | కా.జ్ఞా. | కాశ్యపజ్ఞానకాండః |
| 3. | క్రియ. | క్రియాధికారః |
| 4. | ఖిల. | ఖిలాధికారః |
| 5. | ప్రకీ. | ప్రకీర్ణాధికారః |
| 6. | యజ్ఞ. | యజ్ఞాధికారః |
| 7. | వి.క. | విమానార్చనాకల్పః |
| 8. | శ్రీ వైఖా.గృహ్య. | శ్రీ వైఖానసగృహ్యసూత్రము |
| 9. | శ్రీ వైఖా. స్మార్త. | శ్రీ వైఖానసస్మార్త సూత్రము |
| 10. | సమూ. | సమూర్తార్చనాధికరణం |

# విషయసూచిక

## I. శ్రీమహావిష్ణువు



## II. ఆలయనిర్మాణం

★ ★ ★

# ఆగమమణిమంజరి

## I. శ్రీమహావిష్ణువు

### 1. విమానము-శ్రీమహావిష్ణువు

*విమానమిత్యత్ర విష్ణుః, సా విమానార్చనా, పుణ్యా, సర్వక్రతు ఫలప్రదా, సార్వజనీనా, చిరస్థాయినీ, విష్ణుపూజాం వినా వేదాః శాస్త్రాణి ఆచారసంపదః శుభదా న భవన్తి. యథా ఆదిత్యం వినా లోకా న మనోహా తా భవన్తి. యథా ఇంద్రియాణి అకర్మణ్యతాం యాన్తి॥*

**కా.జ్ఞా. 20 అధ్యాయః**

విమానమనగా శ్రీమహావిష్ణువు. ఆ శ్రీమహావిష్ణువుయొక్క అర్చనయే విమానార్చన. ఇది పుణ్యప్రదము, సర్వయజ్ఞఫలప్రదము, సార్వజనీనమైనది. చిరస్థాయినికూడా.

విష్ణుపూజలేనిదే వేదములు శాస్త్రములు ఆచార సంపదలు శుభప్రదవములు కావు. సూర్యుడు లేనిదే లోకవములు ఎట్లు మనోహితవములు కావో, ఇంద్రియవములు ఆయా కర్మలందు శక్తిహీనములగునో అట్లే విష్ణుపూజ అవశ్యము చేయతగినది.

*తస్మాత్పరంబ్రహ్మ పరంజ్యోతిః అక్షరం*
*సర్వభూతాత్మకం సర్వాధారం సనాతనం*
*పరం పురుషమర్చయేత్ తత్ విమానార్చనమ్॥*

**వి.ఖ. 1 పటలః.**

శ్రుతి ప్రతిపాదించుట వలన పరబ్రహ్మ పరంజ్యోతి అక్షరుడు సర్వభూతాత్మకుడు సర్వాధారుడు సనాతనుడు పరుడు పురుషుడు పరమాత్మ. ఆ పరమాత్మ అర్చనమే విమానార్చనము.

## 2. విష్ణువిశిష్టత

*విశ్వవ్యాపక శీలత్వాత్ విష్ణురిత్యభిధీయతే॥*

సమూ. 1,9.

విశ్వమంతయు వ్యాపించు స్వభావము ఉండుటచేత విష్ణువు అని పిలువబడుచున్నాడు.

## 3. నారాయణవైశిష్ట్యము

*సర్వేషామపి దేవానాం పరో నారాయణః స్మృతః*
*నారాయణః పరంబ్రహ్మ పరమాత్మా పరోఽవ్యయః*
*సబ్రహ్మ సశివశ్చేతి శ్రుతిరాహ సనాతనీ॥*

సమూ. 1,6-7

సర్వదేవతలలో శ్రేష్ఠుడు శ్రీమన్నారాయణుడుగా చెప్పబడినది. శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మ పరమాత్మ పరుడు అవ్యయుడు బ్రహ్మరుద్ర శబ్దవాచ్యుడని శ్రుతి చెప్పుచున్నది.

## 4. విమానార్చనవిశిష్టత

*విమానార్చనం సర్వక్రతుఫలప్రదం*
*సర్వకామప్రదంచేతి బ్రహ్మచాశంసత్॥*

వి.క. 1 పటలం

విమానార్చనము సర్వయజ్ఞఫలప్రదమైనది. సర్వాభీష్ట ఫలప్రదమైనది అని బ్రహ్మచేత చెప్పబడినది.

## 5. శ్రీమన్నారాయణుడు సర్వకారణభూతుడు

*శ్రీమన్నారాయణ ఏవ పరమాత్మా సర్వకారణమితి॥*

ఉ.బ్రహ్మ. 1వ అధికారం

పరమాత్మ శ్రీమన్నారాయణుడే సర్వకారణభూతుడు.

## 6. విష్ణువుయొక్క వర్ణములు

*దేవః కృతయుగే శ్వేతవర్ణః త్రేతాయాం రుక్మాభః, ద్వాపరే రక్తాభః,*
*కలౌశ్యామవర్ణః సర్వేషు శ్యామవర్ణోవా॥*

వి.క. 20 పటలః

శ్రీమహావిష్ణువు కృతయుగమునందు తెలుపువర్ణముగను, త్రేతాయుగమునందు బంగారు వర్ణముగను ద్వాపరయుగమునందు ఎరుపువర్ణముగను, కలియుగమునందు నల్లని వర్ణముగనూ ఉండును.

అన్నియుగములందు నల్లనివర్ణముతో కూడా ఉండగలడని తెలియుచున్నది.

## 7. విష్ణ్వాలయములేని ప్రదేశము నివాసమునకు అయోగ్యము

*విష్ణ్వాలయవిహీనేతు తద్దేశే న వసేద్బుధః।*
*విష్ణ్వాలయవిహీనశ్చేత్ సదేశ స్త్వాసురస్మృతః॥*

సమూ. 2,28

విష్ణ్వాలయము లేని దేశమునందు ఎవ్వరూ నివాసముండకూడదు.

విష్ణ్వాలయము లేని ప్రదేశము రాక్షసప్రదేశముగా పిలువబడుచున్నది.

## 8. ప్రాఙ్ముఖవిమానము శ్రేష్ఠము

*దేవదేవస్య విష్ణోస్తు విమానం ప్రాఙ్ముఖం వరమ్॥*

సమూ. 2,33.

దేవదేవుడైన విష్ణువు యొక్క విమానము ప్రాఙ్ముఖమైన శ్రేష్ఠము.

## 9. విష్ణ్వాది పంచమూర్తులు

*ధర్మజ్ఞానమథైశ్వర్యం వైరాగ్యమితి వైగుణాః*
*ఆదిమూర్తి స్సముద్భూతాః చత్వారోమూర్తయః క్రమాత్*
*సమస్తా విష్ణుమూర్తిస్తు వ్యస్తాస్తే పురుషాదికాః*
*విష్ణుంచ పురుషం సత్యమచ్యుతం చానిరుద్ధకమ్॥*

ఖిల. 21, 55

గుణములు ధర్మం, జ్ఞానం, ఐశ్వర్యం, వైరాగ్యం అని నాలుగు విధములు. ఆదిమూర్తి నుండి నలుగురు మూర్తులు ఆవిర్భవించిరి. మొత్తము విష్ణుమూర్తి స్వరూపమే.

పంచమూర్తులు విష్ణు - పురుష - సత్య - అచ్యుత - అనిరుద్ధులని.

## 10. మూర్తి–వేదసామ్యము

*కృతం త్రేతా ద్వాపరశ్చ కలిశ్చేతి యథాక్రమమ్*
*ఋక్సామయజురాథర్వ వేదాశ్చత్వార ఏవ తే।*
*భూర్భువస్సువర్మహశ్చేతి లోకాస్తేతు చతుర్విధాః॥*

ఖిల. 21, 58

శ్రీమహావిష్ణువునుండి ఆవిర్భవించిన పురుష–సత్య–అచ్యుత–అనిరుద్ధమూర్తులు క్రమముగా కృత–త్రేతా– ద్వాపర – కలియుగములతోనూ, ఋక్–సామ–యజు–అథర్వవేదములతోనూ, భూలోక–భువర్లోక–సువర్లోక–మహర్లోకములతోనూ సమానములు.

ఈ మూర్తుల అర్చన నిత్యము శాంతి పుష్టి సుఖప్రదమైనది.

## 11. యజ్ఞము–విష్ణువు

*ధర్మత్వమేవ యజ్ఞస్య విష్ణు రిత్యాహవైశ్రుతిః॥*

సమూ. 1,25

యజ్ఞధర్మమే శ్రీమహావిష్ణువు అని శ్రుతి చెప్పుచున్నది. యజ్ఞ పురుషుడే శ్రీమహావిష్ణువు.

## 12. విష్ణువునకు శ్రేష్ఠభూమి

*ప్రాగుదక్ ప్రవణా వాని విష్ణోఃభూమిః ప్రకీర్తితః॥*

సమూ. 2,14

తూర్పు ఉత్తరము పల్లముగా ఉన్న భూమి విష్ణువునకు శ్రేష్ఠభూమిగా చెప్పబడుచున్నది.

## 13. దశావతార పూజాఫలము

*వైరాగ్యయోగైశ్వర్యేప్సుః మత్స్యకూర్మౌ,*
*రాజారాష్ట్ర వివృద్ధయే వరాహం, శత్రుదస్యువినాశాయాపరాజిత*
*కాంక్షీ నృసింహం, రాజ్యలాభాయ విద్యార్థం వామనం,*
*త్రివిక్రమంచ, జామదగ్న్యం ధర్మవృద్ధి సుఖకాంక్షీ, రామం*
*యోగార్థీ, సార్వభౌమకామో బలభద్రరామం, భోగైశ్వర్య*
*సుఖప్రీత్యై కృష్ణం, పాపౌఘ విఘ్నాయ కల్కినం*
*పూజయేదితి విజ్ఞాయతే॥*

కా.జ్ఞా. 37 అధ్యాయం

వైరాగ్యము, యోగము, ఐశ్వర్యము వాంఛించువాడు మత్స్య కూర్మములను, రాజా రాష్ట్ర అభివృద్ధి కాంక్షించువాడు వరాహమూర్తిని, శత్రువినాశము జయమును కోరువాడు నృసింహ స్వామిని, రాజ్యలాభము కొరకు, విద్యకొరకు వామనుని, త్రివిక్రమస్వామిని, ధర్మవృద్ధికొరకు సుఖమును కోరువాడు జమదగ్నిని, యోగార్థి అయినవాడు శ్రీరామచంద్రమూర్తిని, సార్వభౌమకాముడు బలభద్రరాముని, భోగ-ఐశ్వర్య-సుఖప్రీతి కొరకు కృష్ణుని, పాపనాశనము కొరకు కల్కి దేవతను పూజించవలయునని తెలియుచున్నది.

## 14. పరిషద్గణము–పూజావిశిష్టత

*సర్వత్ర అనపాయిగణైః సార్థమాచరేత్.*
*దేవీహీనే పత్న్యపత్యహానిః, మునిహీనే ధర్మనాశః,*
*విష్వక్సేనహీనే కులోత్సాదనం, వీశహీనే రిపువృద్ధిః,*
*చక్రహీనే సంసారచక్రం, శంఖహీనే మౌఢ్యం, ధ్వజహీనే కార్పణ్యం,*
*యూథేశహీనే భృత్యహానిర్భవతి॥*

కా.జ్ఞా. 34 అధ్యాయం

ఆలయమునందు పరిషద్గణములతో పరమాత్మని అర్చించ వలయును.

| | |
|---|---|
| దేవీ అర్చన హీనమైనచో | భార్యకు, సంతానమునకు హాని, |
| ముని అర్చన హీనమైనచో | ధర్మనాశనము |
| విష్వక్సేనఅర్చన హీనమైనచో | కులనాశనము |
| గరుడార్చన లేనిచో | శతృవృద్ధి |
| చక్రార్చన లేనిచో | పంసారనాశనము |
| శంఖార్చన లేనిచో | మూఢత్వము |
| ధ్వజార్చనలేనిచో | దయాహీనత |
| యూథేశ అర్చనహీనమైనచో | సేవకాహాని జరుగును. |

కావున పరిషద్గణముతో పరమాత్మని అర్చించుట అవశ్య కర్తవ్యము.

## 15. భగవద్రూపవిశిష్టత

*బ్రహ్మాదయోపి తద్రూపలక్షణనిశ్చయం*
*జ్ఞాతుమశక్తశ్చిత్రభిత్తౌ తద్రూపం భక్తి తూలికయా*
*సంకల్ప్య వర్ణైరాలిఖ్య ఆలోకయన్తి.*
*తస్మాద్భక్తిరేవకారణం తత్రాతో ఉభీష్ట*
*దర్శన యోగ్యం తత్ భగవద్రూపం కల్పయేత్॥*

కా.జ్ఞా. 51 అధ్యాయం

బ్రహ్మాదిదేవతలు పరమాత్మునియొక్క రూపమును ఇదమిత్థముగా నిశ్చయించుకొనలేక చిత్తమనుగోడయందు భక్తి అను కుంచతో లిఖించుకొని వర్ణములు కలిపి దర్శించుకొనుచున్నారు.

అందువలన భక్తియేప్రధానకారణము దర్శనయోగ్యమైన భగవద్రూపమును అవశ్యము కల్పించుకొనవలయును.

## 16. పరమాత్మ భక్తబంధువు

*దర్శన–స్పర్శన–వివిధోపచారసమర్పణ నృత్తగీత వాద్యకరణాదినా భక్తబంధుః భక్తసఖ ఇతిచోచ్యతే॥*

ఉ. బ్రహ్మ. 4వ అధికారం

దర్శనముచేత స్పర్శచేత వివిధములైన ఉపచార సమర్పణచేత, నృత్యగీతవాద్యాదులు చేయుటచేత భగవంతుడు భక్తబంధువై భక్తసఖుడు అగుచున్నాడు అని చెప్పబడుచున్నది.

## 17. సద్వారకం అద్వారకం

*జపహోమరూపారాధనమపి ప్రత్యేకం ద్వివిధం భవతి. అద్వారకం సద్వారకమితి. ఇతర మన్త్రజపః సద్వారకం ఉక్తమంత్రైః హోమః అద్వారకం. ఇతర మన్త్రైః హోమః సద్వారకమ్॥*

ఉ. బ్రహ్మ. 1వ అధికారం

జప హోమ రూప ఆరాధన ప్రత్యేకముగా రెండు విధములు. అద్వారకమని సద్వారకమని.

ఇతరమంత్రజపము, హోమము సద్వారకము. ఉక్తమంత్ర హోమము అద్వారకము. (ఉక్తమంత్రహోమమనగా వైష్ణవ- విష్ణుసూక్త- యద్దేవాది పారమత్మిక-మూలమంత్రాది హోమము)



# II. ఆలయనిర్మాణం

## 1. భూపరీక్ష

*సర్వాశాగా ఆయతా శ్రేష్ఠా. ప్రాగుత్తరానతా మధ్యమా. అన్యా అనతా జఘన్యా అగ్రాహ్యా/ఖ్యాం ఖనిత్వా తన్మృదం సంగృహ్య పూరితా అధికాచేత్ ఉత్తమా. పూరితా సమాచేత్ మధ్యమా. న్యూనహీనాను: కనీయసీ॥*

కా.జ్ఞా. 12 అధ్యాయం.

నలుదిక్కుల సమానమైన పొడవుకల భూమి శ్రేష్ఠమైనది. తూర్పు ఉత్తరములు పల్లమైన భూమి మధ్యమైనది. మిగిలిన దిక్కులు పల్లమైనది అధమభూమి.

గుంటను త్రవ్వి ఆ మట్టిని ఆ గుంటయందే ఉంచగా భూమి కంటె మట్టి పైకి వచ్చిన యెడల ఆ భూమి ఉత్తమభూమి అని, భూమితో సమముగా వచ్చిన మధ్యమభూమి అని, భూమికంటె తక్కువ ఉన్నయెడల ఆ భూమి అధమభూమి అని భూపరీక్షా విధానము చెప్పబడినది.

## 2. వాస్తు విధానము–నవవిధ ప్రదేశములు

*వైష్ణవం బ్రాహ్మం రౌద్రం ఐంద్రం గారుడం*
*భౌతికం అసురం రాక్షసం పైశాచమితి నవవిధో దేశః॥*

కా.జ్ఞా. 11 అధ్యాయం.

వైష్ణవం, బ్రాహ్మం, రౌద్రం, ఐంద్రం, గారుడం, భౌతికం, అసురం, రాక్షసం, పైశాచం అని భూమి గంధవర్ణరసములను బట్టి తొమ్మిది విధములుగా ఉండును.

### వైష్ణవం

*బుద్ధి సత్త్వబలప్రదం గంభీరశబ్దం సుశ్లక్ష్ణం సమోష్ణం శీతం వైష్ణవమితి॥*

సద్బుద్ధి ప్రదాయకమైనది, గంభీర శబ్దము నిచ్చునది. సమానమైన ఉష్ణమును శీతలమును ఇచ్చునది వైష్ణవభూమిగా తెలియవలయును.

బ్రాహ్మం

*సౌమ్యం సత్త్వగుణోపేతం బ్రహ్మవర్చస్కరం సర్వకళ్యాణ సంపత్ప్రదం యత్తత్ బ్రాహ్మమితి॥*

సౌమ్యగుణమును ఇచ్చునది, సత్త్వగుణోపేతమైనది, బ్రహ్మవర్చస్కరమైనది, సర్వకళ్యాణసంపత్ప్రదమైన భూమి బ్రాహ్మభూమిగా తెలియవలయును.

రౌద్రం

*క్రూరకర్మ ప్రదం సుఖప్రీతి వివర్జితం శౌర్యవీర్యప్రదం*
*శృతిధర్మవిరుద్ధం యత్తత్ రౌద్రమితి॥*

క్రూరకర్మప్రదాయకము సుఖసంతోషములు వర్జించునది, శౌర్యవీర్యప్రదము, శాస్త్రవిరుద్ధమైన భూమి రౌద్రభూమిగా తెలియవలయును.

ఐంద్రం

*ధనధాన్యవివృద్ధిదం పశుకృషిబలాహ్లాదదం రాజసగుణప్రదం యత్తత్ ఐంద్రమ్॥*

ధనధాన్యఅభివృద్ధిదాయకము పశువ్యాపారవ్యవసాయ ఆహ్లాదకరము రాజసగుణదాయకమైనది ఐంద్రభూమి.

గారుడం

*మదాహ్లాద పణ్యసంయుక్తం కషాయరసం*
*శౌర్యవీర్యకరం ప్రజాసమృద్ధిదం యత్తత్ గారుడమితి॥*

ఆహ్లాదము ఆనందప్రదమైనది, కషాయరసముతో కూడినది, శౌర్యవీర్యకరమైనది, ప్రజాసమృద్ధి దాయకమైనది గారుడభూమి.

**భౌతికం**

*ప్రజానామన్నదం పుష్టివర్ధనం నిద్రాతంద్రా వివృద్ధిదం యత్తత్ భౌతికమితి॥*

ప్రజలకు అన్నమునిచ్చునది, బలదాయకము, నింద్రాతంద్రాభివృద్ధిదాయకమైనది భౌతికభూమి.

**ఆసురం**

*విద్యాయాగ వినాశనం యుద్ధదర్పప్రదం యత్తత్ ఆసురమితి॥*

విద్యాయాగ వినాశనము యుద్ధదర్పములను ఇచ్చునది ఆసుర భూమి.

**రాక్షసం**

*ప్రజానాం క్షయకారణం సురామాంసాది*
*వృద్ధిదం యత్తత్ రాక్షసమితి॥*

ప్రజలయొక్క క్షీణతకు కారణమైనది, సురామాంసాదుల అభివృద్ధిదాయకమైనది రాక్షసభూమి.

**పైశాచం**

*సరోగం క్షోభకరం తమిస్రం తామసదం*
*సర్వక్షయకరం యత్తత్ పైశాచమితి॥*

రోగప్రదము, క్షోభనుపెట్టునది, అజ్ఞానమును ఇచ్చునది. సర్వక్షయకరము పైశాచభూమిగా తెలియవలయును.

**3. భారతదేశవిశిష్టత**

*ఏతేషు భారతం శ్రేష్ఠం పురుషార్థప్రసాదకమ్*
*తతోఽన్యా భూమయః సర్వాః భోగాయ పరికల్పితాః।*
*కర్మభూమిరియం ప్రోక్తా స్వర్గం సంప్రాప్తుమిచ్ఛతాం*
*శ్రియతే దానమత్రైవ తపశ్చాత్ర ప్రతప్యతే।*

*యజ్ఞైము యజ్ఞపురుషో విష్ణురత్రేజ్యతే ద్విజైః*
*అత్రైవ విష్ణుం ధ్యాయంతో ముక్తిం యాన్తిముముక్షవః।*
*అత్రైవ సకలీకృత్య విష్ణుమారాధయన్తి యే*
*తే లబ్ధసర్వకామాశ్చ తతో ముక్తిం సమాప్నుయుః।*
*తస్మాదత్రైవ యత్నేన సమారాధ్యో జనార్దనః॥*

**ఖిల. 2,27-31.**

అన్ని దేశములలోకెల్లా భారతదేశము శ్రేష్ఠమైనది పురుషార్థ సాధకమైనది. మిగిలిన దేశములు భోగభూములు.

భరతభూమి కర్మభూమి. స్వర్గసాధనకు ఇది ప్రధానసహకారి. ఈ భూమియందే దానము తపస్సులు జరుగుచున్నవి. యజ్ఞపురుషుడైన విష్ణువు అర్చించబడుచున్నాడు.

మోక్షమును పొందగోరువారు ఇక్కడనే విష్ణువును ధ్యానించు చున్నారు. ఆరాధించుచున్నారు కూడా.

ఈ భరతభూమియందే పరమాత్ముడైన శ్రీమహావిష్ణువు ఆరాధ్యుడు.

## 4. ఆరామతటాకాదుల నిర్మాణఫలములు

*ఆరామంచ తటాకంచ మఠం కూపం తథైవచ*
*విష్ణ్వాలయసమీపేతు నిర్మాపయతి యో ధనీ।*
*తస్యపుణ్యఫలం లోకే మహాదానఫలాత్పరమ్*
*దేవకార్యపరో భూత్వా స్వాం తనుం యఃపరిత్యజేత్।*
*సయాతి విష్ణుసాయుజ్యమపి పాతకకృన్నరః॥*

**ఖిల. 28, 50-51**

ఉద్యానవనము, తటాకము, మఠము, బావి మొదలైనవాటిని విష్ణ్వాలయమునకు సమీపమునందు ఏ ధనవంతుడు నిర్మించు చున్నాడో అతనియొక్క పుణ్యఫలము మహాదానఫలముకంటె గొప్పది.

భగవత్ కార్యములో ఉండి స్వదేహమును ఎవరైతే విడిచి పెట్టుచున్నారో వారు పాతకులైనప్పటికీ విష్ణుసాయుజ్యమును పొందుచున్నారు.

## 5. గృహము ఆవశ్యకత

*గృహం హి ప్రాణినాం మూలం. దేహోమూలం శరీరిణాం.*
*వినా దేహం కార్యాణి. అతః సర్వకార్యకరం సంపత్*
*శుభోదయం విధియుతమ్॥*

కా.జ్ఞా. 18 అధ్యాయం.

ప్రాణులకు గృహము ప్రధానమైనది. శరీరధారులకు దేహము ప్రధానమైనది. దేహము లేనిదే సర్వకార్యములు ఆచరించుట కష్టము. అందువలన సర్వకార్యకరము, సంపదలకు మూలము, శుభో దయము, శాస్త్రయుతమైనది గృహము.

## 6. ఆలయాలంకరణ

*సింహ వ్యాల గజ వృష హంస శుక చక్రవాక ముక్తాదామ కదలీక్రముక సోమరూప లతారూప మకరవేదికా దండ యక్ష గంధర్వ సిద్ధ కిన్నర నాగేంద్రాదీన్ క్రీడారససంయుక్తాన్ పాదాంతరేషు అర్పయిత్వా అలంకృత్య భిత్తిభాగేషు సర్వత్ర దేవాంశావతరణ క్రీడాభావవిధానేన అప్సరో యక్ష గంధర్వ నాగముఖ్యైః సమన్వితం చక్షురాహ్లాదకరం రమ్యం మనోహరం యత్నతః కారయేత్॥*

*క్లిష్టరూప కబంధ పిశాచ బ్రహ్మరాక్షసాన్ పాషండ సఖ్యేతర రోగార్తాది రూపోద్వేజనకాన్ క్వచిదపి న కారయేత్॥*

కా.జ్ఞా. 32 అధ్యాయం.

సింహము, వ్యాళము, గజము, వృషభము, హంస, చిలుక, చక్రవాకము, దండలవరుస, అరటివృక్షము, సోమరూపము, లతారూపము, ముసలి, వేదిక, దండ, యక్ష, గంధర్వ, సిద్ధ, కిన్నర,

నాగేంద్రాదులు, క్రీడారససంయుక్తులును పాదమధ్యభాగములందు ఉండునట్లుగా అలంకరించి గోడలందు అంతటా పరమాత్మునియొక్క అంశావతరణ క్రీడా విశేషములతో చిత్రములను, అప్సర-యక్ష-గంధర్వనాగముఖ్యులతో కూడిన నయనానందకరమైన రమ్యము మనోహరమైన వాటిని ఆలయములందు అలంకరింపచేయవలయును.

క్లిష్టమైన రూపములు కబంధ పిశాచ బ్రహ్మరాక్షసులను, నపుంసకులను, ఇతరులను రోగులను ఆర్తులను ఉద్వేగజనకులైన రూపములు సన్నివేశములు ఆలయములందు ఉండకూడదు.

### 7. విష్ణ్వర్చనఫలితము

*అథాగ్నౌ నిత్యహోమాన్తే విష్ణోర్నిత్యార్చా సర్వదేవార్చాభవతి।*
*అగ్నిర్వైదేవానా మవమో విష్ణుః పరమః తదన్తరేణ*
*సర్వా అన్యా దేవతాః ఇతి బ్రాహ్మణమ్.*
*తస్మా ద్గృహే పరమం విష్ణుం ప్రతిష్ఠాప్య సాయం*
*ప్రాతర్హోమాన్తే అర్చయతి॥*

శ్రీవైఖా. గృహ్య. 10, 95-97.

*యజ్ఞేషు విహీనం తత్సంపూర్ణం భవతీతి శ్రుతిః*
*ద్విజాతి రతంద్రితో నిత్యం గృహేదేవాయతనే వా భక్త్యా*
*భగవంతం నారాయణమర్చయేత్.*
*తద్విష్ణోః పరమం పదం గచ్ఛతీతి విజ్ఞాయతే॥*

గృహ్య. 12, 119-121.

గృహస్థుడు నిత్యహోమము పూర్తిచేసుకొన్న తరువాత విష్ణువునకు నిత్యార్చన చేయవలయును. ఇది సర్వదేవార్చన అగుచున్నది. ''అగ్ని దేవతలలోకెల్లా చిన్నవాడు. విష్ణువు పెద్దవాడు. వీరిద్దరిమధ్యలో సర్వదేవతలు'' అని బ్రాహ్మణ వాక్యము.

అందువలన గృహమునందు శ్రేష్ఠుడైన విష్ణువును ప్రతిష్ఠించి ప్రాతస్సాయంకాలములందు హోమానంతరము అర్చించవలయును.

యజ్ఞములందు హీనమైన ఫలము విష్ణ్వర్చన ద్వారా సంపూర్ణము అగుచున్నది.

ద్విజాతి తొందరలేనివాడై ప్రతినిత్యము గృహమునందుగానీ దేవాలయమునందుగానీ భక్తితో భగవంతుడైన శ్రీమన్నారాయణుని అర్చించవలయును.

యజమానుడు ఉత్తమమైన విష్ణుపదప్రాప్తి విష్ణ్వర్చనద్వారా పొందగలడని తెలియుచున్నది.



# III. అర్చనా పూర్వరంగం

## 1. ఊర్ధ్వపుండ్రధారణ ఫలం

*ఊర్ధ్వపుండ్ర ధారణాత్ అశుచిః శుచిరేవ భవేత్॥*

**వి.క. 76 పటలం**

ఊర్ధ్వపుండ్రములను ధరించుటవలన అశుచివ్యక్తి శుచిగా అగుచున్నాడు.

## 2. సంస్కారములు రెండు విధములు

*జాతక సంస్కారో మృతసంస్కారశ్చేతి ద్వౌ సంస్కారౌ భవతః।*
*పూర్వేణ ఇమంలోకం అపరేణ పరలోకం జయతి॥*

**శ్రీ వైఖా. గృహ్య. 7,1-2,3.**

జాతక సంస్కారమని మృతసంస్కారమని సంస్కారములు రెండు విధములు.

జాతకసంస్కారములను ఆచరించుటద్వారా ఈ లోకమును, మృతసంస్కారములను ఆచరించుట ద్వారా పితృలోకములను మానవుడు జయించుచున్నాడు.

## 3. గ్రహపూజ–సర్వదోషనివారణ

*ఏతేన నవగ్రహజా దుఃఖాః వ్యాధయః శాన్తిం యాన్తి*
*గ్రహపూజాం పురస్కృత్య సర్వకర్మ సమారభేదితి విజ్ఞాయతే.*

**శ్రీ వైఖా. స్మార్త. 4,137-138.**

నవగ్రహ పూజావిధానముచేత గ్రహములద్వారా ఏర్పడ్డ దుఃఖములు వ్యాధులు శాన్తిని పొందుచున్నవి. లేనిచో గొప్పదోషము ఏర్పడును.

గ్రహపూజను పురస్కరించుకొని సర్వకర్మలు ఆరంభించ వలయునని తెలియుచున్నది.

*గ్రహాయత్తా లోకయాత్రా*
*తస్మాదాత్మవిరుద్ధే ప్రాప్తే గ్రహాన్ సమ్యక్ పూజయతి॥*

శ్రీ వైఖా. స్మార్త. 13,123-124.

లోకయాత్ర గ్రహాధీనమై యున్నది. అందువలన ఆత్మ విరుద్ధము ఏర్పడినప్పుడు గ్రహములను చక్కగా పూజించవలయును.

## 4. సహస్రచంద్రదర్శనం – బ్రహ్మశరీరం

*తదేవం వర్తమానస్య యద్యష్టమాసాధికాశీతివర్షాణి*
*రవివర్షేణాధికాన్యధిగచ్ఛేయుః సదృష్టః సహస్రచంద్రో భవతి॥*

శ్రీ వైఖా. గృహ్య. 3, 21-193

*తమేనం క్రియాయుక్తం పుణ్యకృత్తమం బ్రహ్మశరీరం*
*ఇత్యాచక్షతే॥* 194

80 సంవత్సరములు 8 నెలలు నిండినట్లయితే ఆ యజమాని సహస్రచంద్రులను దర్శించినవాడు అగుచున్నాడు.

ఆ సహస్రచంద్రులను దర్శించిన వ్యక్తి పుణ్యకర్మలతో కూడిన బ్రహ్మశరీరమును ధరించినవాడుగ చెప్పబడుచున్నాడు.

## 5. ఆత్మయజ్ఞం

*స్వయంజ్యోతిః, ఆత్మాయజమానః, బుద్ధిః పత్నీ, హృదయ పుండరీకం వేదీ, రోమాణి దర్భాః, ప్రాణో –గార్హపత్యః, అపాన– ఆహవనీయః, వ్యానో – అన్వాహార్యః, ఉదానః – సభ్యః, సమాన –ఆవసథ్య ఇతి పంచాగ్నయో భవన్తి॥*

*జిహ్వాదీంద్రియాణి యజ్ఞపాత్రాణి, రసాదయో విషయాః, హవీంషి అన్యఫలం, ఓం అర్థావాప్తిః, తదేవం ఏకాధ్వర్యుః ఆత్మయజ్ఞం సంకల్ప్య "అమృతోపస్తరణమసి" ఇత్యన్నం ప్రోక్ష్య అన్నసూక్తేన అభిమృశ్య, "ఊర్జస్కరం" ఇత్యాధావం పీత్వా అంగుష్ఠానామికామధ్యమైః ఆదాయ*

**అన్నం, ప్రాణాయస్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయ స్వాహా, సమానాయ స్వాహా, ఇతి పంచాహుతీః పాత్రం స్పృశన్నేవ హుత్వా ఊర్ధ్వస్కరం ఇతి పునశ్చాథావం పీత్వా అశ్నీయాత్॥**

**శ్రీ వైఖా. గృహ్యా. 2,18-144.**

***ఏవం సాయంప్రాతః ప్రాణాగ్నిహోత్రంతయజేత 147.***

***ఆత్మయాజినాం ఇదమిజ్యం అగ్నిహోత్రం యావజ్జీవకమితి బ్రహ్మవాదినోవదన్తి॥ 148.***

యజమాని స్వయంజ్యోతియై ఆత్మ యజమానిగా, బుద్ధిని భార్యగ, హృదయమును అగ్నికుండముగ, రోమములు దర్భలుగ, ప్రాణవాయువు గార్హపత్యాగ్ని కుండముగ, అపానవాయువు అహవనీయాగ్ని కుండముగ, వ్యాన వాయువు అన్వాహార్యాగ్ని కుండముగ, ఉదానవాయువు సభ్యాగ్ని కుండముగ, సమానవాయువు ఆవసథ్యాగ్ని కుండవముగ పంచాగ్నులు అగుచున్నవి. అట్లే జిహ్వాది ఇంద్రియములు యజ్ఞపాత్రలుగ, రసాదులు విషయములుగ, హవిస్సు ఫలముగ ఓంకారము ప్రయోజనముగ అధ్వర్యు అనబడు యజమాని ఆత్మయజ్ఞమును సంకల్పించుకొని, అన్నసూక్తముతో అన్నమును అభిమంత్రించి స్వాహాకారములతో అన్నమును తినవలయును.

ఈ విధముగ ప్రాతస్సాయం కాలములందు ప్రాణాగ్నిహోత్రమును యజమాని ఆచరించవలయును.

ఆత్మయజ్ఞము చేయువారలకు ఈ ప్రాణాగ్నిహోత్రము ఆజీవనపర్యంతము ఉండగలదని బ్రహ్మవాదులు భావించుచున్నారు.

## 6. పుణ్యాహవాచనం

***పుణ్యాహేకృతే తదహః పుణ్యం భవతి।***
***ఆదావన్తే వా పుణ్యాహేన సర్వాఃక్రియాః***
***పుణ్యాః పరిపూర్ణా భవన్తి॥***

**శ్రీ వైఖా. గృహ్యా. 1,91-92.**

పుణ్యాహవాచనము చేసినట్లయితే ఆ దినము పుణ్యదినము అగుచున్నది.

కార్యక్రమము యొక్క ప్రారంభమందుగానీ చివరియందుగానీ పుణ్యాహవాచన కర్మ చేసినట్లయితే అన్ని క్రియలు పుణ్యములుగా పరిపూర్ణములుగా అగుచున్నవి.

## 7. అర్చకసహాయకులు–పరిచారకులు

*అర్చకస్య సహాయాస్తు కింకరాః పరిచారకాః।*
*బహుకార్యకరాశ్చైతే గ్రాహ్యాస్తు పరిచారకాః॥*

ప్రకీ. 18,17

అర్చకునకు సహాయకుడు సేవకుడు పరిచారకుడు. అనేక కార్యములందు అర్చకునకు సహాయము చేయుటకొరకు పరిచారకులు నిర్ణయింపబడుదురు.

## 8. పంచమహాయజ్ఞములు

*బ్రహ్మయజ్ఞో దేవయజ్ఞః పితృయజ్ఞో భూతయజ్ఞో మనుష్య యజ్ఞశ్చేతిపంచానాం అహరహరనుష్ఠానమ్॥*

శ్రీ వైఖా. స్మార్త. 1-1-4

గృహస్థునకు పంచమహాయజ్ఞములు విధించబడినవి. అవి

1. బ్రహ్మయజ్ఞము – శాస్త్రగ్రంథములను చదువుట
2. దేవయజ్ఞము – భగవదారాధన చేయుట
3. పితృయజ్ఞము – తల్లిదండ్రులను ఆరాధించుట
4. భూతయజ్ఞము – పిపీలకాది ప్రాణికోటికి ఆహారమును సమర్పించుట
5. మనుష్యయజ్ఞము – అతిథిని సత్కరించుట

గృహస్థుడు ఇవి తప్పక ఆచరించవలయును.

★★★

# IV. ఆగమములు

## 1. విష్ణుతంత్రములు

*విష్ణోస్తన్త్రం ద్విధాప్రోక్తం వైదికం తాంత్రికం క్రమాత్।*
*వైఖానసం పాంచరాత్రం సౌమ్యమాగ్నేయ మిత్యపి॥*

సమూ. 78,1-2

*వైఖానసం వైదికంస్యాత్ పాంచరాత్రంతు తాంత్రికమ్॥*

78,5

విష్ణుతంత్రము రెండు విధములు వైదికమని, తాంత్రికమని. అవి వైఖానసము పాంచరాత్రము, సౌమ్యమని ఆగ్నేయమని కూడా క్రమముగా అనబడుచున్నవి.

వైఖానసము వైదికమని, పాంచరాత్రము తాంత్రికమని పిలువ బడుచున్నవి.

## 2. వైఖానసశాస్త్రము

*వైఖానసం మహాశాస్త్రం సర్వవేదేషు ఉద్ధృతం సర్వవేదార్థసార భూతం అప్రతర్క్యం అనిందితం వైదికైః ఉపసేవితం విష్ణోః ఆరాధనాయ సర్వభూతహితార్థాయ శాబ్దం ప్రమాణమవలంబ్య విష్ణునా విఖనసఉక్తం. విఖనసా భృగ్వాదీనాం ఉక్తమ్॥*

వి.క. 97 పటలం

వైఖానసము మహాశాస్త్రము సర్వవేదములనుండి గ్రహించ బడినది. సర్వవేదసారభూతమైనది. వివాదములకుఅతీతమైంది. నిందించకూడనిది. వైదికులచేత ఆచరింపబడుచున్నది.

ఆరాధనకొరకుగాను ఈ అర్చనావిధానము సర్వ భూతముల హితము కొరకు వేదమును ప్రమాణముగా భావించుకొని

శ్రీ మహావిష్ణువుచేత విఖనసమహామునికి ఉపదేశింబడినది. ఆ విఖనస మహామునిచేత భృగ్వాదులకు వివరించబడినది.

## 3. వైఖానసశాస్త్రము విశిష్ఠత

*వైఖానసేన శాస్త్రేణ అర్చనం క్రియతేయది*
*లోకే సర్వత్రశాన్తిః స్యాత్ రాజారాష్ట్రప్రవర్ధనమ్॥*

క్రియ. **36, 34**

వైఖానసశాస్త్రముచేత పరమాత్మునకు అర్చన చేసినట్లయితే లోకమునందు అంతటా శాన్తి రాజు రాష్ట్రము అభివృద్ధి కాగలరు.

*వైఖానసమిదం శాస్త్రం అన్యశాస్త్ర అనపేక్షితమ్॥*

ప్రకీ. **26, 8**

ఈ వైఖానస శాస్త్రము ఇతరశాస్త్ర అపేక్షలేనిది.

*వైఖానసం వైదికం స్యాత్ వైదికైః అర్పితం ద్విజైః*
*ఐహికాముష్మిక ఫలప్రదం సౌమ్యం ప్రకీర్తితమ్॥*

ప్రకీ. **30, 6**

వైఖానసము వైదికము, వైదికులైన ద్విజులచేత పరమాత్ముని ఈ శాస్త్రము ద్వారా అర్చించినట్లయితే ఐహిక ఆముష్మిక ఫలములు, సౌమ్యత కలుగును.

## 4. వైఖానసుడు – విశిష్టత

*అశ్వత్థః కపిలాగావః తులసీ విఖనోద్విజః*
*హరిప్రియాస్తు చత్వారః తేషు వైఖానసోవరః*

*విష్ణుం వైఖానసం వేదం యో దూషయతి పాతకీ*
*ఆచంద్రార్కం మహాఘోరం నిరయం యాతి రౌరవమ్।*
*శతాధిక్యం శతాధిక్యం శతాధిక్యం మహర్షయః*
*విద్ధి వైఖానసే దత్తం దానం విష్ణుకరే యథా॥*

క్రియ. **36, 37-40**

అశ్వత్థవృక్షము, కపిలగోవు, తులసీ, వైఖానసబ్రాహ్మణుడు శ్రీ మహావిష్ణువునకు ప్రియమైనవి. ఈ నాల్గింటిలోనూ వైఖానస బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు.

విష్ణువుని, వైఖానసుని, వేదమును, ఎవరు దూషిస్తారో వారు పాతకులై ఆచంద్రార్కము మహాఘోరమైన రౌరవనరకమును పొందుచున్నారు.

వైఖానసుని కొరకు ఇవ్వబడిన దానము శ్రీమహావిష్ణువుకొరకు ఇవ్వబడినదిగా తెలియవలయును.

*యే వైఖానససూత్రేణ సంస్కృతాస్తు ద్విజాతయః*
*తే విష్ణు సదృశాజ్ఞేయాః సర్వేషా ముత్తమోత్తమాః।*
*వైఖానసానాం సర్వేషాం గర్భవైష్ణవ జన్మనామ్*
*నారాయణ స్స్వయం గర్భే ముద్రాం ధారయతే నిజామ్॥*

ప్రకీ. **30, 87-89.**

ఎవరు వైఖానససూత్రవముచేత ద్విజాతులు సంస్కరింప బడుచున్నారో వారు విష్ణుసదృశులుగా అందరిలో ఉత్తమోత్తములుగా తెలియవలయును.

వైఖానసులు గర్భవైష్ణవజన్ములు. వీరికి శ్రీమన్నారాయణుడే స్వయముగా గర్భమునందు శంఖచక్రముద్రలను ధరింపచేయు చున్నాడు.

**5. తంత్రసంకరదోషం**

*తంత్ర సంకర దోషేణ రాజారాష్ట్రం వినశ్యతి॥*

సమూ. **78, 2**

తంత్ర సంకర దోషము చేత (వైఖానసము యొక్క స్థానము నందు పాంచరాత్రము పాంచరాత్రము యొక్క స్థానమునందు వైఖానసము చేరినట్లయితే)

రాజు రాష్ట్రము నశించగలదు. తంత్రసంకరము మహాదోషము.

## 6. తంత్రసంకర ప్రాయశ్చిత్తం

*అథవక్ష్యే విశేషేణ తంత్ర సంకరనిష్కృతిమ్*
*వైష్ణవస్య అన్యతంత్రేణ సంకరే దోషమాదిశేత్।*
*గ్రామస్య యజమానస్య రాజ్ఞో రాష్ట్రస్య సంక్షయః*
*తద్దోష శమనాయైవ సాంకర్యమపహాయచ।*
*పద్మానలౌ వైష్ణవంచ విష్ణుసూక్తంచ పౌరుషమ్*
*పారమాత్మికమీంకారాద్యష్టాశీతించ విశేషతః ।*
*అష్టోత్తరసహస్రం వా శతమష్టోత్తరం తు వా*
*దోషగౌరవముద్దిశ్య హుత్వా పూర్వవదాచరేత్॥*

ప్రకీ. 30, 1-4.

తంత్ర సంకర ప్రాయశ్చిత్తము చెప్పబడుచున్నది. వైష్ణవమునకు అన్యతంత్రముతో సంకరము జరిగినట్లయితే దోషముగా భావించ వలయును.

గ్రామమునకు యజమానునకు రాజునకు రాష్ట్రమునకు దోషము ఏర్పడును, దోషశాంతికై సాంకర్యమును తొలగించి పౌండరీకాగ్నికుండమునందు వైష్ణవ-విష్ణుసూక్త-పురుషసూక్త -పారమాత్మిక-ఈంకారాదులు దోష సందర్భమునుబట్టి 1008, లేక 108 పర్యాయములుగానీ హోమముచేసి తంత్రసంకరమును నివారించవలయును.

## 7. శాస్త్రాచరణ-ఆవశ్యకత

*యచ్ఛాస్త్ర విధిముత్సృజ్య క్రియతే కామకారతః*
*నోక్తం దద్యాత్ఫలం కర్మ ప్రత్యుతా ఽనర్థదం భవేత్॥*

ప్రకీ. 26,6.

శాస్త్రపద్ధతిని విడిచి ఇష్టానుసారము సంచరించినట్లయితే సత్ఫలములు రాకపోగా అనర్థములు ఎదురగును.

## 8. ధర్మద్వారములు

*అహింసా వైదికం కర్మ ధ్యానమింద్రియనిగ్రహః*
*తపోఽథగురుశుశ్రూషా ధర్మద్వారాః షడీరితాః॥*

ప్రకీ. 36, 427.

అహింస, వేదోక్తకర్మ, ధ్యానం, ఇంద్రియనిగ్రహం, తపస్సు, గురుశుశ్రూషా ఇవి ధర్మద్వారములుగా చెప్పబడినవి.

## 9. క్షమాప్రార్థన

*నారాయణ నమస్తేఽస్తు నమోభక్తపరాయణ*
*నమో నమో నమస్తేఽస్తు నమస్తేఽస్తు నమోనమః।*
*అజ్ఞానాదర్థలోభాద్వా రాగాద్ద్వేషాత్ప్రమాదతః*
*అపరాధః కృతోయస్తం క్షమస్వ పురుషోత్తమ॥*

ప్రకీ. 36, 639.

నారాయణ! నీకు నమస్కారము, భక్తపరాయణ! నమస్కారము. నీకు నమస్కారము నమస్కారము నమస్కారము.

అజ్ఞానము చేతగాని అర్థలోభము చేతగానీ రాగముచేతగాని ద్వేషముచేతగాని ప్రమాదముచేతగానీ అపరాధము చేసిన వానిని క్షమించు పురుషోత్తమ.

## 10. స్వయంవ్యక్త ఆలయ పూజావిశిష్టత

*స్వయంవ్యక్తస్థలే పూజా సర్వలోక శుభప్రదా॥*

ప్రకీ. 34.7.

స్వయంవ్యక్త స్థలమునందలి అర్చనావిధానము సర్వలోక శుభప్రదమైనది.

## 11. అర్చకునినిత్యకర్మ

*స్నాత్వా సంధ్యాముపాస్యైవ తర్పయిత్వా విధానతః।*
*నిత్యకర్మాణి కృత్వైవ విష్ణోరర్చన మారభేత్॥*

సమూ. 43, 36.

స్నానముచేసి సంధ్యావందనము ఆచరించి దేవఋషి తర్పణాదులు గావించి నిత్యకర్మపూర్తిచేసుకొని విష్ణ్వర్చన ఆరంభించ వలయును.

## 12. గాయత్రీ సావిత్రీమంత్రములు

*చతుర్వింశత్యక్షరా గాయత్రీతి శృతిః.*
*సాగాయత్రీ వ్యాహృతిత్రయసంయుక్తత్వాత్ సవితృ*
*దైవత్యాత్ సావిత్రీ ఇత్యుచ్యతే॥*

వి.క. 79 పటలః

24 అక్షరములు కలది గాయత్రీమంత్రమని శ్రుతి చెప్పు చున్నది. ఆ గాయత్రీమంత్రము వ్యాహృతి త్రయముతో కూడి సవితృ దేవత ఆధిపత్యము వలన సావిత్రి అని చెప్పబడుచున్నది.

## 13. సావిత్రీమంత్ర అధ్యయన ఫలం

*సావిత్ర్యధ్యయనాత్ ఆయుః శ్రీబ్రహ్మవర్చసమృద్ధిః.*
*ప్రజాసమృద్ధిః, ధనధాన్యసమృద్ధిః భవతి॥*

వి.క. 79 పటలః

సావిత్రీమంత్ర అధ్యయనము వలన ఆయుర్దాయము, లక్ష్మీకటాక్షము, బ్రహ్మవర్చస్సు, ప్రజాసమృద్ధి, ధనధాన్య సమృద్ధి అగుచున్నది.

## 14. ఆలయం – దైవశరీరం

*ఆలయం గోపురంచైవ ప్రతిమా పీఠమేవచ।*
*శరీరమేవ దేవస్య స్మృతమేతత్ చతుష్టయమ్॥*

క్రియ. 20, 138

ఆలయం (విమానం) గోపురం, ప్రతిమ, పీఠం ఈ నాలుగు పరమాత్మునియొక్క శరీరభాగములుగా చెప్పబడుచున్నది.

## 15. ఆచార్యునకు ఆశౌచవిధానం

*ఆచార్యస్యర్త్విజాశ్చైవ సూతకం ప్రేతకం తథా*
*ఆశౌచం యది సంప్రాప్తం కర్మమధ్యే విశేషతః।*

*స్నానేనైవ విశుద్ధిః స్యాత్ స్నాత్వా కర్మ సమాచరేత్*
*దీక్షితానాం వ్రతస్థానాం యతీనాం బ్రహ్మచారిణాం।*
*ఆశౌచం న భవేత్ తేషాం ఉదకే పద్మపత్రవత్॥*

క్రియ. **33, 55-56**

ఆచార్యులకు ఋత్విక్కులకు కర్మమధ్యయందు సూతకముగానీ ప్రేతకముగానీ సంప్రాప్తించిన యెడల స్నానము చేతనే శుద్ధి అగుచున్నారు.

దీక్షితులకు వ్రతస్థులకు యతులకు బ్రహ్మచారులకు ఆశౌచములేదు. వీరికి తామరాకుపై గల నీటి బొట్టువలె ఆశౌచ విధానము ఉండును. స్నానముతో వీరు శుద్ధి అగుచున్నారని భావము.

## 16. ప్రాచీన ఆలయసాంప్రదాయములు

*పౌరాణికేషు స్థానేషు యథాపూర్వం తథాచరేత్*
*అన్యథా న కర్తవ్యం యది కుర్యాద్వినశ్యతి॥*

క్రియ. **21, 19.**

ప్రాచీన ఆలయములందు పూర్వము ఏ సంప్రదాయము ఆచరింపబడినదో ఆ సంప్రదాయములే తప్పక అనుసరించ వలయును. భిన్నముగా నడుచుకొనకూడదు.

*దైవికే చార్షికే క్షేత్రే యథాపూర్వం తథాచరేత్*
*అవిధికం అలక్షణ్యం అప్రమాణం నదోషకృత్।*
*తస్మాత్ సర్వప్రయత్నేన యథాపూర్వం తథాచరేత్॥*

క్రియ. **21,58,59.**

దైవికాలయములందు ఆర్షక్షేత్రములందు గల సంప్రదా యములే అవశ్యము ఆచరణీయములు. అధికములైననూ, అలక్షణములైననూ, అప్రమాణములైననూ అవి దోషములు కావు. సర్వప్రయత్నముతో ప్రాచీనములైన వాటిని ఆచరించవలయును.

## 17. సామృతకల్పనం

*బాలాలయే అర్చనం కుర్వన్ విమానం కారయేద్బుధః।*
*ఏతత్ సామృతమిత్యుక్తం శక్తః సామృతమాచరేత్॥*

సమూ. 4,35

బాలాలయ నిర్మాణము చేసి అందు విగ్రహప్రతిష్ఠను ఆచరించి ప్రతినిత్యము అర్చనను చేయుచూ విమాననిర్మాణము గావించిన అది సామృతము అనబడును. శక్తివంతుడు సామృతమార్గమును అనుసరించుచున్నాడు.

## 18. బాలాలయం ఇటుకలతో నిర్మించకూడదు

*బాలాలయం మృదా కుర్యాత్ నతు తత్ర*
*శిలా ఇష్టకైః॥*

సమూ. 4,3.

బాలాలయము మట్టితో చేయవలయును. ఆ బాలాలయము శిలలతోగానీ ఇటుకలతోగానీ నిర్మించకూడదు.



# V. పూజావిధానం

## 1. మానసపూజ

*తద్గతేనైవ మనసా నైరన్తర్యేణ చిన్తయేత్।*
*ధ్యాత్త్వైవ మర్చయేద్దేవం సాపూజా మానసీస్మృతా॥*

ఖి. 1, 23.

పరమాత్మునియందే లగ్నము చేయబడిన మనస్సుతో నిరన్తరము అర్చన చేయవలయును. ధ్యానముచేత పరమాత్ముని అర్చనచేయుట మానసపూజ అనబడుచున్నది.

## 2. విగ్రహపూజ

*ఉక్త ప్రమాణప్రతిమాం హాటకాది విధిం పరామ్।*
*ప్రతిష్ఠాప్యార్చయేత్ సాతు బేరపూజేతి చోదితా॥*

క్రియ. 1, 8.

చెప్పబడిన కొలతలతో ఉక్తద్రవ్యముతో విగ్రహసౌందర్యమున మలచి ప్రతిష్ఠించి అర్చించిన అది విగ్రహపూజగా పిలువబడుచున్నది.

## 3. విగ్రహపూజావిశిష్టత

*చక్షుషః ప్రీతికరణాత్ మనసో హృదయస్యచ*
*ప్రీత్యా సంజాయతే భక్తిః భక్తస్య సులభో హరిః।*
*తస్మాత్త్రయాణా మేతేషాం బేరపూజా విశిష్యతే॥*

క్రియ. 1, 13.

నేత్రములకు ఆనందదాయకమైన, మనస్సునకు, హృదయమునకు ప్రీతిని కలిగించు, భక్తికి పరాకాష్ఠ అగు మహదానందము కలిగించు పరమాత్మదర్శనము బేరపూజ ద్వారా జరుగుచున్నది.

మానసపూజ - హోమపూజ - బేరపూజలలో బేరపూజ విశిష్టమైనదిగా తెలియవలయును.

## 4. అగ్నిపూజ

*యో యజ్ఞరూపీ తస్యార్చా హోమపూజేతి కథ్యతే॥*

ఖి. 1, 24

*ధ్యాత్వా యథోక్త హవిషా యజేత్ తత్ హోమపూజనమ్॥*

ఖి. 1,12

యజ్ఞరూపుడైన పరమాత్ముని హోమముద్వారా అర్చించుట హోమపూజ అనబడుచున్నది.

ధ్యానముచేసి శాస్త్రోక్తములైన ఆజ్య-చరు-అపూపాదులతో హోమముచేసి ఆరాధించుట అగ్నిపూజ అనబడుచున్నది.

## 5. సమారాధన నాల్గువిధములు

*అథ సమారాధనం చతుర్విధం భవతి జప-హుత- అర్చన-ధ్యానానీతి॥*

ఖి. 1, 24

పరమాత్ముని ఆరాధనచేయు విధానము నాల్గు విధములుగా ఉండును. అవి జపము-హోమము-అర్చన-ధ్యానము అని.

## 6. యోగం

*జీవాత్మపరమాత్మనోః యోగః యోగ ఇత్యామనన్తి॥*

వి.క. 90 పటలం

జీవాత్మపరమాత్మలయొక్క సంయోగమే యోగమన బడుచున్నది.

## 7. ధ్యానం

*పరమాత్మనః జీవాత్మనా చింతనం ధ్యానమ్॥*

వి.క. 93 పటలం

జీవాత్మ పరమాత్మునిగూర్చి చింతనచేయుటయే ధ్యానము.

## 8. సమాధి

*జీవాత్మపరమాత్మనోః సమావస్థా సమాధిః॥*

వి.క. 96 పటలం

జీవాత్మ పరమాత్మలయొక్క సమానమైన అవస్థ సమాధి అనబడుచున్నది.

**9. జ్ఞానం-జ్ఞాతా-జ్ఞేయం**

***పరమాత్మా జ్ఞేయః, జీవాత్మా జ్ఞాతా, శృతయోజ్ఞానమ్॥***

**వి.క. 80 పటలం**

పరమాత్మ తెలియతగినవాడు జ్ఞేయుడు, జీవాత్మ జ్ఞాతా తెలుసుకొనతగినవాడు, శృతులు జ్ఞానము.

**10. అర్చనవిశిష్టత**

***తేష్వర్చనం సర్వాఽర్థసాధనం స్యాత్॥***

**వి.క. 80 పటలం**

జప-హోమ-అర్చన-ధ్యానములలో అర్చన సర్వార్థసాధనమైనది కాగలదు.

**11. పంచప్రణామములు**

*ప్రణామస్స్యాత్ నమస్కారః సతుపంచవిధఃస్మృతః*
*మస్తిష్కం సంపుటంచైవ ప్రహ్వాంగం దండసంజ్ఞితమ్।*
*పంచాంగం పంచమంప్రాహుః తేషాం రూపం ప్రకీర్త్యతే॥*

*చిన్తయన్ మనసా దేవం మస్తకే అంజలి సంయుతమ్*
*మస్తిష్కమితి విజ్ఞేయః ప్రణామః ప్రథమస్స్మృతః॥*

*తథా ధ్యాయన్ హృదా దైవం హృదయే అంజలి సంయుతం*
*క్రియమాణో నమస్కారః సంపుటః పరికీర్తితః॥*

*అంజలిం హృదయే కృత్వా నతకాయేన భక్తితః*
*క్రియతే యో నమస్కారః ప్రహ్వాంగస్య ఉదాహృతః॥*

*శయిత్వా దండవత్ భూమౌ అంజలిం సంప్రసార్యచ*
*క్రియేత యో నమస్కారః ఉచ్యతే దండసంజ్ఞితః॥*

*పాదాంగులిభ్యాం జానుభ్యాం లలాటేన చ భూతలమ్।*
*క్రియేత-సంస్పృశన్ భక్త్యా సా పంచాంగనమస్క్రియా॥*

ఖి ల. 22,7-13.

ప్రణామమనగా నమస్కారము. ఇది ఐదువిధములు. మస్తిష్కం, సంపుటం, ప్రహ్వాంగం, దండాంగం, పంచాంగం అని.

### మస్తిష్కప్రణామము

మనస్సుతో పరమాత్ముని ధ్యానించుచూ శిరస్సున అంజలి బద్ధుడై ప్రణామము చేయుట.

### సంపుటప్రణామము

ధ్యానించుచూ హృదయమునందు అంజలిబద్ధుడై నమస్కరించుట సంపుటప్రణామము.

### ప్రహ్వాంగప్రణామము

ధ్యానించుచూ హృదయమునందు అంజలిబద్ధుడై శరీరమును వంచి భక్తితో నమస్కరించుట ప్రహ్వాంగప్రణామము.

### దండాంగప్రణామము

దండమువలె శయనించి అంజలిబద్ధుడై నమస్కారము చేయుట దండాంగప్రణామము.

### పంచాంగప్రణామము

పాదాంగుళములతో జానువులతో లలాటముతో శరీరమును భూతలమునందు స్పృశించు విధముగ భక్తితో ప్రణామము చేయుట పంచాంగప్రణామము.

## 12. అమూర్తార్చనం

*అమూర్తా అగ్న్యాహుతిః ప్రోక్తా॥*

ఖిల. 22, 155

అమూర్తార్చనమనగా అగ్ని ద్వారా పరమాత్ముని అర్చించుట.

## 13. సమూర్తార్చనం

*సమూర్తాబింబపూజనమ్॥* ఖిల. 22, 155

సమూర్తార్చనమనగా విగ్రహారాధన.

## 14. సమూర్తార్చనవిశిష్టత

*విశేషభక్తిహేతుత్వాత్ చక్షుషోః ప్రీతికారణాత్*
*రూపసందర్శనాత్ భక్తిః మనసోఽతీవ జాయతే*

ఖిల. 22, 156

అధికమైనభక్తి ఆవిర్భవించుటకు హేతువగుటవలన, నేత్రములకు ఆనందదాయకమగుటవలన, రూపసందర్శన జరుగుటవలన మనసునకు భక్తికలుగుటవలన సమూర్తార్చన విశిష్టమైనదిగా తెలియవలయును.

## 15. సాకారనిరాకారార్చనలు

*సాకారంచ నిరాకారం భవత్యారాధనం ద్విధా*
*ప్రతిమారాధనం శ్రేష్ఠం సాకార మభిధీయతే।*
*స్థండిలే సలిలౌ వాఽపి హృదయే సూర్యమండలే*
*ఆరాధనం నిరాకారం తయోస్సాకార ముత్తమమ్।*
*సంస్కారాన్ అర్చణీయాని ద్రవ్యాణి వివిధాని చ*
*సంకల్ప్య మనసా దద్యాత్ నిరాకారార్చనం హరేః॥*

ఖిల. 20,17-19

ఆరాధన రెండువిధములు. సాకారమని నిరాకారమని. ప్రతిమారాధన సాకారమనబడుచున్నది. స్థండిలమునందుగానీ, జలమునందుగానీ, హృదయమునందుగానీ సూర్యమండలము నందుగానీ నిరాకారార్చన చేయతగినది.

అర్పణీయములైన వివిధద్రవ్యములను మనసుతో సంకల్పించి పరమాత్మునకు సమర్పించుటయే నిరాకార్చన.

సాకారనిరాకారార్చనలలో సాకారార్చనయే గొప్పది.

## 16. ప్రతిమార్చనవిశిష్టత

*చక్షుషోః ప్రీతిజననం మనసోహృదయస్యచ*
*యథోపయోగశక్యత్వాత్ కర్తుం పూజాం సుమాదిభిః।*
*అభీక్ష్ణ దర్శనౌచిత్యాత్ సౌలభ్యేన విశేషతః*
*విశేషభక్తిహేతుత్వాత్ ప్రతిమారాధనం వరమ్॥*

ఖిల. 20,21-23.

నేత్రములకు మనస్సునకు హృదయమునకు ఆనందమును కలిగించునది. పుష్పములతో పూజించుటకు శక్యమైనది. సులభముగా చూచుటకు యోగ్యమైనది. విశేషభక్తికి హేతువైనది కావున ప్రతిమార్చన విశిష్టమైనదిగా తెలయవలయును.

## 17. పూజాంగములు

*పూజార్థభోగ పర్యాప్త భూమిర్దేవాలయస్తథా*
*బింబంచ లక్షణోపేతం పూజకస్యాత్మసంస్కృతిః।*
*ధ్యానమావాహనంచైవ మంత్రోద్రవ్యం తథైవచ*
*విహితస్సంప్రయోగశ్చ భక్తిరేభిః పురస్కృతా।*
*ఏభిర్దశభిరంగైస్తు సంపూర్ణం పూజనం భవేత్॥*

ఖిల. 22,191-193.

సుసంపన్నమైన భూమి, దేవాలయము, లక్షణోపేతమైన బింబము, పూజకునియొక్క ఆత్మసంస్కృతి, ధ్యానము, ఆవాహనము, మంత్రము, ద్రవ్యము, ప్రయోగము, భక్తి అను ఈ పది పూజాంగములు.

ఈ పదిపూజాంగములతో అర్చన సంపూర్ణము అగుచున్నది.

## 18. బలిపీఠ నిర్మాణఫలం

*విష్ణుభూతం సముద్దిశ్య పీఠం సమ్యక్ప్రకల్పయేత్*
*సర్వదేవమయం పీఠం సర్వలోకమయం తథా।*
*సర్వలోకస్యరక్షార్థం కారయేల్లక్షణాన్వితమ్*
*రక్షః పిశాచ భూతానాం నాశనం ధాన్యవర్ధనమ్।*
*శ్రీసౌభాగ్యాభివృద్ధిశ్చ భవేత్పీఠే కృతేనృణామ్॥*

క్రియ. **5, 295-297**

ప్రతిఆలయంవమునందు బలిపీఠము తప్పక నిర్మించవలయును. ఈ పీఠము సర్వదేవమయము, సర్వలోకమయము, సర్వలోకరక్షణార్థము, రాక్షసపిశాచభూతములనాశనమునకు హేతువైనది. ధాన్యవర్ధనమైనదికూడా.

శ్రీ సౌభాగ్య అభివృద్ధి కలిగించునది ఈ బలిపీఠము.



# VI. అర్చన యజ్ఞఫలం

## 1. పంచాగ్నులు – పంచబేరములు

*యథాకర్మణి ఏకస్య కల్పితాః పంచవహ్నయః*
*యథాచైక శరీరస్య వాయుపంచకకల్పనమ్।*
*తథైవైక విమానస్య పంచబేరాణి కల్పయేత్॥*

క్రియ. 9,7-8.

వైదికకర్మయందు పంచాగ్నులు కల్పించినట్లు శరీరమునందు పంచవాయువులున్నట్లు ఏకవిమానమునందు పంచబేరములు ప్రతిష్ఠించవలయును.

| | వహ్నులు | వాయువులు | బేరములు |
|---|---|---|---|
| 1. | గార్హపత్యం | ప్రాణ | ధృవ |
| 2. | అన్వాహార్యం | అపాన | కౌతుక |
| 3. | ఆహవనీయం | వ్యాన | స్నపన |
| 4. | ఆవసథ్యం | ఉదాన | ఉత్సవ |
| 5. | సభ్యం | సమాన | బలిబేరములు |

## 2. త్రేతాగ్నులు – బేరత్రయము

*అథవాత్రీణి బేరాణి యథా త్రేతాగ్నికల్పనమ్।*
*ధృవార్చా బేరమేకంచ బలిబేరమథోత్సవమ్॥*

క్రియ. 9,9-10

త్రేతాగ్నులను కల్పించిన విధముగా మూడు బేరములను ఆలయములో ప్రతిష్ఠించవచ్చును.

| | అగ్నులు | బేరములు |
|---|---|---|
| 1. | గార్హపత్యం | ధృవబేరం |
| 2. | అన్వాహార్యం | కౌతుకబేరం |
| 3. | ఆవసథ్యం | ఉత్సవబేరం |

## 3. స్థానకాసనాది విగ్రహములు - తత్ఫలములు

*స్థానకప్రతిమాం స్థాప్య సామీప్యఫలమాప్నుయాత్*
*ఆసీనప్రతిమాం స్థాప్య సారూప్యం ఫలమశ్నుతే।*
*శయానప్రతిమాం స్థాప్య కర్తా సాయుజ్యమాప్నుయాత్॥*

స్థానక ప్రతిమను (నిలబడిన విగ్రహమును) ప్రతిష్ఠించిన యెడల సామీప్య ఫలమును యజమానుడు పొందుచున్నాడు. అట్లే ఆసీనప్రతిమను ప్రతిష్ఠించిన యెడల సాయుజ్యఫలమును పొందుచున్నాడు.

## 4. చక్రప్రతిష్ఠాఫలం

*ఏవం యః కురుతే భక్త్యా చక్రస్య స్థాపనం నరః*
*సర్వాన్ కామానవాప్నోతి కర్మసిద్ధో భవిష్యతి।*
*సవిశేషేణ శుద్ధాత్మా విష్ణులోకే మహీయతే॥*

**ఖిల. 13, 28-29.**

దేవాలయమునందు సుదర్శనచక్రమును ప్రతిష్ఠించినట్లయితే సర్వకామములు యజమానుడు పొంది కర్మసిద్ధుడై శుద్ధాత్ముడై విష్ణులోకమును ప్రవేశించుచున్నాడు.

## 5. ఆవాహనం - ఆవాహనవిధానం

*సర్వత్రవ్యాపినస్తస్య సర్వస్మాత్ పరమాత్మనః*
*ఏకత్రస్మరణం యత్తత్ ఆవాహనమితి స్మృతమ్॥*

**ఉ. బ్రహ్మ. 4వ అధికారః.**

అంతటావ్యాపించిన పరమాత్ముని ఒకే ప్రదేశమునందు స్మరించుకొనుట (ఆహ్వానించుట) ఆవాహన అనబడుచున్నది.

*సర్వత్రవ్యాపినస్తస్య పరస్య పరమాత్మనః*
*ఏకత్రస్మరణం యత్తత్ ఆవాహనముదీరితమ్॥*

*అరణ్యాం వ్యాపితోవహ్నిః ఏకత్రజ్వలితోయథా*
*తథా ధ్యానేన భక్తస్యహ్నాది విష్ణుః ప్రకాశతే॥*

క్రియ. 7, 37-38

అరణియందు వ్యాప్తమైన అగ్ని మథనముచేత ఎట్లు జ్వలించునో, అట్లే ధ్యానముచేత భక్తునియొక్క హృదయమునందు విష్ణువు ప్రకాశించుచున్నాడు.

*సర్వాధారం సనాతనం అప్రమేయం అచింత్యం*
*నిర్గుణం నిర్మలం క్షీరేసర్పిః తిలేతైలం పుష్పేగంధం*
*ఫలేరసం కాష్ఠే అగ్నిమివ సర్వవ్యాపినం పరమాత్మానం*
*మనసా సంకల్ప్య ఆవాహయేత్*

*ఆవాహనం ఉద్వాసనం విష్ణోః అయుక్తమితి యథాహిఅరణ్యాం వ్యాప్తః వహ్నిః మథనాత్ సన్నిహితో భవతి. తథైవ ధ్యానమథనేన భక్తస్య హృది విష్ణుః సన్నిహితో భవతి॥*

వి.క. 31 పటలం

సర్వాధారుడు సనాతనుడు అప్రమేయుడు అచింత్యుడు నిర్గుణుడు నిర్మలుడు పరమాత్మ. ఆ పరమాత్ముని క్షీరమునందు నెయ్యివలె, తిలలందు తైలమువలె, పుష్పమునందు గంధమువలె, ఫలమునందు రసమువలె, కాష్ఠమునందు అగ్నివలె సర్వవ్యాపకుడైన పరమాత్మను మనస్సుతో సంకల్పించుకొని ఆవాహన చేయవలయును.

ఆవాహన ఉద్వాసన విష్ణువునకు అయుక్తము. కానీ అరణి యందు ఉన్న అగ్ని మథనముద్వారా ఎట్లు సన్నిహితము అగునో అట్లే ధ్యానమథనము చేత భక్తునియొక్క హృదయమునందు విష్ణువు సన్నిహితుడు అగుచున్నాడు.

## 6. ప్రణవం

*మంత్రాణాం ప్రాణః ప్రణవః*
*ప్రణవాకారం బ్రహ్మరూపం. ఓం ఇతిబ్రహ్మేతిశ్రుతిః॥*

వి.క. 78 పటలం

మంత్రవములకు ప్రాణవము ప్రణవవము. ప్రణవాకారవే బ్రహ్మరూపము."ఓం" కారమే బ్రహ్మము అని శృతి చెప్పుచున్నది.

## 7. పవిత్రవిశిష్టత

*యథా హరిహరమహేంద్రాణాం చక్రం శూలం*
*వజ్రమివ బ్రాహ్మణానాం పవిత్రం॥*

*అపవిత్రకరేణ దత్త-భుక్త-జప-హుత- ధ్యాన-అర్చనాదీని న కుర్యాత్ కుర్యాచ్చేత్ నిష్ఫలం అభిచారికం భవతి॥*

వి.క. 67 పటలం

హరి - హర - మహేంద్రులకు చక్రం శూలం వజ్రం అను అయుధములున్నట్లు బ్రాహ్మణులకు పవిత్రము ప్రధానమైంది.

పవిత్రములేని చేతితో దానము ఇచ్చుట - భుజించుట - జపము - హోమము - ధ్యానము - అర్చనాదులు చేయకూడదు. అట్లుచేసిన నిష్ఫలము అభిచారికము అగుచున్నది.

## 8. ప్రతిమా అవశ్యకత

*ప్రతిమాం వినా యత్ స్తోత్రవందనాదికం క్రియతే*
*తద్భిత్తిం వినా చిత్రలేఖనమ్*

ఉ.బ్రహ్మ. 1వ అధికారం

ప్రతిమలేకుండా స్తోత్రవందనాదికములు చేసినట్లయితే గోడలేకుండ చిత్రలేఖనము వేసినట్లు అగుచున్నది.

స్తోత్రవందనాదికములు చేయవలయునన్న ప్రతిమ అవశ్యము ప్రతిష్ఠించవలసియున్నది.

**9. ఉత్తమబ్రహ్మవిద్య**

*ఉత్తమబ్రహ్మ విద్యా నామ తత్సమారాధనమ్॥*

ఉ.బ్రహ్మ. 4వ అధికారం

ఉత్తమబ్రహ్మవిద్య అనగా పరమాత్ముని అరాధించుటయే.

**10. అర్చనం – పరమోపాయం**

*అతో౽ర్చనం పరమపదప్రాప్తౌ పరమోపాయ ఇతి॥*

ఉ.బ్రహ్మ. 5వ అధికారం

అర్చనమే పరమపదప్రాప్తికి పరమమైన ఉపాయము.

**11. ఉత్తమోత్తమం చతుష్షష్ట్యుపచారవిధానం**

*చతుష్షష్ట్యుపచారాస్యుః ఉత్తమోత్తమ పూజనే॥*

క్రియ. 10,16.

64 ఉపచారములతో పరమాత్ముని పూజించినట్లయితే అది ఉత్తమోత్తమ అర్చన అగుచున్నది.

**12. నిర్గుణం – సగుణం**

*నిర్గుణం హేయగుణరహితమాత్రం*
*సగుణంతు సమస్తకళ్యాణగుణభూషితం॥*

ఉ.బ్రహ్మ. 2వ అధికారం

హేయగుణములు లేకుండుట నిర్గుణము. సమస్త కళ్యాణ గుణ భూషితముల స్వరూపము సగుణము.

*నిర్గుణాపేక్షయా సగుణమేవ వరమితి నసంశయః॥*

నిర్గుణముకంటే సగుణస్వరూపమే శ్రేష్ఠమైనది. అందు సంశయము లేదు.

## 13. శుద్ధాన్ననివేదనఫలము

*శుద్ధాన్నస్య ప్రదానేన త్రిశుద్ధాభవతి ప్రజా*
*అపూపాది ప్రదానేన మనస్వీజాయతే నరః॥*

ప్రకీ. 35, 370

పరమాత్మునకు శుద్ధాన్నమును నివేదన చేయుటచేత ప్రజలు త్రికరణశుద్ధులు అగుచున్నారు.

పిండివంటకములు మొదలైనవి పరమాత్మునకు సమర్పించుట చేత శుద్ధమనస్విగా అగుచున్నాడు.

## 14. అర్చన ఐదురకములు

*ధ్రువబేరార్చనం పూర్వం ద్వితీయం శాంతపూజనం*
*కౌతుకాభ్యర్చనం పశ్చాత్ భూతపీఠార్చనం పరమ్।*
*పంచమం బలిపూజా స్యాదేతైః పంచభిరర్చనైః॥*

క్రియ. 10, 54-55.

**అర్చన ఐదురకములు, అవి**

1. ధ్రువబేరార్చన
2. విష్వక్సేనపూజ
3. కౌతుకమూర్తి అర్చనం
4. భూతపీఠార్చనం
5. బలిపూజ

## 15. ఉపచారములు – అనేక విధములు

*స్పృశ్యా దృశ్యాస్తథా శ్రావ్యా భోజ్యాశ్చైవ చతుర్విధాః॥*

క్రియ. 10, 35.

ఉపచారములు స్పృశ్యములు , దృశ్యములు, శ్రావ్యములు, భోజ్యములు అని నాల్గు విధములు.

## 16. పాద్యం

*మన్త్రేణ పాదయోర్దత్తమాధావం పాద్యముచ్యతే॥*

సమూ. 78, 38.

మంత్రముతో పరమాత్మని పాదపద్మములకు సమర్పించబడిన జలము పాద్యమనబడుచున్నది.

## 17. దైవదర్శనఫలం

*దేవస్యాలోకనేన శ్రీరారోగ్యం ప్రజాస్తథా*
*ధనధాన్యాని సర్వాశ్చ సంపదశ్చ భవన్తిచ*
*అశుభాని చ సర్వాణి వినశ్యన్తి న సంశయః॥*

సమూ. 55, 73-74

పరమాత్మని దర్శనముచేత సంపద ఆరోగ్యము, సత్సంతానము, ధనధాన్యములు, సర్వసంపదలు కలుగుచున్నవి. అశుభములు సర్వములు నశించుచున్నవి అందు సందేహములేదు.

## 18. బలియజ్ఞఫలం

*దేవాదీనాం నృణాం చైవ బలం యస్మాత్ ప్రవర్ధతే*
*తస్మాద్బలిరితి ప్రోక్తః సర్వభూతహితావహః।*
*బలిభ్రమణకాలే ఒస్మిన్ యే అనుగచ్ఛన్తి భక్తితః*
*పదేపదే యజ్ఞశతఫలం తే ఒపి సమాప్నుయుః॥*

సమూ. 48, 28-30.

దేవతలకు కింపురుషాదులకు మానవులకు బలమును కలిగించునది కనుక బలి అనుపేరు ఏర్పడినది. ఇది సర్వభూత హితమును కలిగించును.

బలివేయు కాలమునందు ఎవరు భక్తితో భగవంతుని అనుసరించుచున్నారో వారికి 100 యజ్ఞఫలములు సంభవించును.

## 19. అర్చనాఫలం

*యే ఽర్చన్తి సదాభక్త్యా తే విష్ణోః*
*పదమాప్నుయుః॥*

సమూ. 43, 36.

ఎవరు భక్తితో ఎల్లప్పుడు పరమాత్ముని అర్చించుచున్నారో వారు విష్ణుపదప్రాప్తిని పొందుచున్నారు.

## 20. తీర్థ వైశిష్ట్యం

*పరమాణుసమం తీర్థం మహాపాతకనాశనం*
*తథైవాష్టగుణం పాపం తద్భూమౌ పతితే యది॥*

సమూ. 78, 44.

పరమాణుసమానమైన తీర్థము మహాపాతక నాశనమైనది. భూమిపై బిందువు పడినప్పటికీ అది అష్టగుణముల పాపమును ఇచ్చును.

స్వామితీర్థము బిందువుకూడా భూమిపై పడనీయక తాగవలయును.

## 21. తీర్థం ప్రసాదం

*ప్రసాదమమృతం బ్రూయాదన్నం దేవనివేదితమ్.*
*తీర్థం చామృతమిత్యేవ దేవపాదోదకం వదేత్॥*

ప్రకీ. 35, 226

పరమాత్మునకు నివేదించిన ప్రసాదమును, (అన్నము) పాదోదక తీర్థమును అమృతముగ భావించి గ్రహించవలయును.

## 22. షట్కాలార్చనలు – తత్ఫలములు

*ప్రత్యూషశ్చప్రభాతశ్చ మధ్యాహ్నశ్చాపరాహ్ణకః*
*సాయంకాలో నిశీథశ్చ పూజాకాలాస్తు షట్స్మృతాః।*
*ప్రాతఃకాలే ఽర్చనం కుర్యాత్ జపహోమాభివృద్ధయే*

*రాజారాష్ట్రాభివృద్ధ్యర్థం మధ్యాహ్నార్చన మిష్యతే॥*
*సాయంకాలే అర్చనం చైవ సర్వసస్యాభివృద్ధయే*
*ఉషః కాలార్చనం ప్రోక్తం పజాపశువివృద్ధయే*
*అపరాహ్ణార్చనం చైవ దైత్యనాశనహేతవే*
*అర్ధరాత్రార్చనం ప్రోక్తం చతుష్పాదభివృద్ధయే॥*

ప్రకీ. 18, 249 -252

ప్రత్యూషః కాలార్చన, ప్రభాతకాలార్చన, మధ్యాహ్నకాలార్చన, అపరాహ్ణకాలార్చన, సాయంకాలార్చన, అర్ధరాత్రికాలార్చన ఇవి షట్కాలార్చనలు.

| | |
|---|---|
| ఉషఃకాలార్చన వలన | ప్రజాపశు అభివృద్ధి |
| ప్రాతః కాలార్చన వలన | జపహోమ అభివృద్ధి |
| మధ్యాహ్నకాలార్చన వలన | రాజారాష్ట్రాభివృద్ధి |
| అపరాహ్ణకాలార్చన వలన | రాక్షసనాశనము |
| సాయంకాలార్చన వలన | సర్వసస్య అభివృద్ధి |
| అర్ధరాత్రి కాలార్చన వలన | జంతువుల అభివృద్ధి కలుగును. |

## 23. ప్రదక్షిణవిధానము

*యుగ్మప్రదక్షిణం కుర్యాత్ అయుగ్మం త్వాభిచారికమ్॥*

ప్రకీ. 18, 39

విష్ణ్వాలయమునందు యుగ్మప్రదక్షిణము చేయవలయును (యుగ్మసంఖ్య అనగా 2,4,6,8,10 మొదలగునవి) అయుగ్మ ప్రదక్షిణము (బేసిసంఖ్య) మహాదోషము.

## 24. పుష్పగంధాది దానఫలములు

*పుష్పం గంధం చయోదద్యాత్ ఇంద్రలోకం సమాప్నుయాత్*
*ధూపస్య తు ప్రదానేన రవిలోకే వసేచ్చిరమ్.*

---

*దీపం దత్వా త్వనిర్వాణం మానవః కేశవాలయే*
*తేజస్వీ స యశస్వీచ భూయాన్నాప్య పునర్భవః।*
*అష్టాంగమర్ఘ్యం యో దద్యాత్ శ్రద్ధయా జగదీశితుః*

*జన్మాంతరే అపి న స్యాతాం క్షుత్పిపాసే తు తస్యవై*
*స్నానార్థాని చవస్తూని దద్యాత్ ప్లోతాదికాని యః*
*సర్వపాపవిశుద్ధాత్మా సవై రాజా భవిష్యతి॥*

**ఖి౦. 28, 35-39**

పరమాత్మునకు అర్చనార్థము పుష్పము గంధము ఎవరైతే సమర్పించుచున్నారో వారు ఇంద్రలోకమును పొందుచున్నారు.

ధూపద్రవ్యదానమువలన రవిలోకప్రాప్తి దీపద్రవ్యసమర్పణ వలన తేజస్వీ యశస్వి కాగలడు. అర్ఘ్యద్రవ్య సమర్పణచే జన్మాంతర మందుకూడా ఆకలిదప్పులు ఉండవు. స్నానార్థవస్తువులైన ప్లోతాది వస్తువుల సమర్పణవలన సర్వపాపవిశుద్ధాత్మ అయి రాజు కాగలడు.

## 25. పుష్పాదిదానఫలములు

*పుష్పాణి హేమరత్నాని దివ్యాన్యాభరణానిచ,*
*సౌవర్ణానిచ పాత్రాణి గవాశ్వాదీంశ్చతుష్పదాన్*
*యోదద్యాద్విష్ణవే భక్త్యా తథాఽఽన్యానపి కాంశ్చన*
*సతద్వస్తూని లబ్ధ్వా వై సుఖీ స్యాద్భావిజన్మసు॥*

**ఖి౦. 28, 44-45**

పుష్పములు, బంగారము, రత్నములు, దివ్యాభరణములు, సువర్ణపాత్రలు, గో, అశ్వాది జంతువులు వీటిని ఎవరైతే విష్ణువునకు దానము చేయుచున్నారో వారికి ఆ వస్తువులు లభించి భావి జన్మలందు సుఖముగా ఉండగలరు.

## 26. దేవయాగఫలం

*సర్వైర్దానతపోయజ్ఞైః ప్రాప్యతే యత్ఫలం మహత్*
*దేవయాగస్య సంకల్పాత్ తత్ఫలం సమవాప్నుయాత్,*
*సంసిద్ధే బ్రహ్మపద్మే తు విమానారంభకర్మణి*
*విష్ణులోక మవాప్నోతి పూజ్యమానస్సదాఽమరైః,*

*సప్త జన్మకృతం పాపం స్వల్పం వా యదివా బహు*
*విష్ణ్వాలయవిన్యాస ప్రారంభాదేవ నశ్యతి।*
*సిద్ధే కర్మణ్యసిద్ధే వా తత్ఫలం సర్వమాప్నుయాత్।*
*ప్రశస్తదేశే భూభాగే యో భక్త్యా భవనం హరేః.*
*కారయేదక్షయాన్ లోకాన్ సనరః ప్రతిపద్యతే॥*

ఖి. 28, 1-5

దానతపస్సులు చేయుటచేత ఎంతఫలము లభించుచున్నదో దేవయాగసంకల్పము ద్వారా అంతటి ఫలము కలుగుచున్నది.

విమాననిర్మాణము ఆరంభము చేయుటద్వారా యజమానుడు దేవతలచే పూజింపబడి విష్ణులోకమును పొందుచున్నాడు.

విష్ణ్వాలయ విన్యాసప్రారంభముచేత ఏడుజన్మలపాపము కొద్దిదైనను అధికమైననూ నశించుచున్నది. ఆలయనిర్మాణము పూర్తి అయినప్పటికీ కాకపోయినప్పటికీ ఈ ఫలము కలుగును.

## 27. వివిధ ఉపచారహీనములు – వాటిఫలితములు

*ఆసనస్యవిహీనేతు ధర్మనాశో భవిష్యతి,*
*స్వాగతే బుద్ధినాశస్స్యాత్ మూకత్వమనుమానకే।*
*విహీనే పాదుకాయాస్తు పంగుత్వం సంభవత్యుత*
*పాద్యహీనే మహాన్‌రోగః క్లేశశ్చాపి భవిష్యతి*
*దంతధావనహీనేచ దుష్టదంతో உభిజాయతే।*
*తాంబూలహీనే విద్వేషం కుష్ఠం తైలవిహీనకే।*
*కేశసంశోధనే హీనే గలరోగోభవిష్యతి*
*స్నానద్రవ్యవిహీనే చ స్నానహీనే తథైవచ*
*రాజయక్ష్మా భవేద్రోగః పాపిష్ఠశ్చ సుదారుణః।*
*ప్లోతహీనే వాతరోగో వస్త్రహీనే జలోదరః*
*సంవ్యానహీనే హృద్రోగో యజ్ఞసూత్రవిహీనకే*

*అగ్నిదాహభయంచైవ మందాగ్నిత్వంచ జాయతే*
*గంధహీనేచ కుష్ఠస్స్యాత్ భూషాహీనే మహద్భయమ్।*
*పుష్పహీనే త్వలాభస్స్యాత్ తథాచ కఫసంభవః॥*

**ప్రకీ. 35, 520-526**

నిత్యార్చనలో వివిధఉపచారములు హీనమైనచో వాటి దుష్ఫలితములు వైఖానస ఆగమమునందు ఉపదేశింపబడినవి. వాటి వివరములు.

| ఉపచారహీనము | ఫలితములు |
|---|---|
| ఆసనము | ధర్మనాశము |
| స్వాగతము | బుద్ధినాశము |
| అనుమానము | మూకత్వము |
| పాదుకాస్థాపన | పంగుత్వం |
| పాద్యము | రోగము |
| దంతధావనం | దుష్టదంతములు |
| తాంబూలం | ద్వేషం |
| తైలం | కుష్ఠు |
| కేశసంశోధనం | గలరోగం |
| స్నానద్రవ్యం, స్నానం | రోగము |
| ప్లోతము | వాతరోగము |
| వస్త్రం | జలోదరము |
| ఉత్తరీయం | హృద్రోగము |
| యజ్ఞోపవీతం | అగ్నిదాహం |
| గంధం | కుష్ఠురోగం |
| భూషణం | భయం |
| పుష్పం | కఫము అనుదోషములు |

సంభవించును.

## 28. నిత్యార్చనావిచ్ఛిన్నం – మహాదోషం

*నిత్యార్చనేతు విచ్ఛిన్నే యజమానో వినశ్యతి॥*

సమూ. 4, 40

నిత్యార్చనము విచ్ఛిన్నమైనచో యజమానికి హాని కలుగుచున్నది.

## 29. నిత్యార్చనం – అగ్నిహోత్రఫలం

*తస్మాదాలయే విధినా విష్ణోః నిత్యార్చనం*
*అనాహితాగ్నీనాం అగ్నిహోత్రసమం. యస్మాత్ ఏతచ్చ*
*అగ్నిహోత్రఫలం దదాతి*

కా.జ్ఞా. 1వ అధ్యాయం

విష్ణువుయొక్క నిత్యార్చన అగ్నిహోత్రములేనివారికి అగ్నిహోత్ర సమము కాగలదు. అగ్నిహోత్రఫలమును ఈ అర్చన ఇచ్చుచున్నది.

## 30. పుష్పములు – ఉత్తమాదిభేదములు

*శ్వేత పీతకృష్ణ రక్త చతుర్వర్ణాని త్రివర్ణాని చ*
*దైవికాన్యుత్తమాని। ద్వివర్ణాని మధ్యమాని, ఏకవర్ణాని*
*అధమాని॥*

కా.జ్ఞా. 72 అధ్యాయం

తెలుపు, పసుపు, నలుపు, ఎరుపు వర్ణముల పుష్పములు, మూడు వర్ణముల పుష్పములు దైవికకర్మలందు ఉత్తమములు.

రెండు వర్ణముల పుష్పములు మధ్యమములు
ఏకవర్ణపుష్పములు అధమములు అని తెలియవలయును.

**శ్వేతం పుష్పం శాంతికరం, పీతం పౌష్టికం, కృష్ణం వశ్యకరం, రక్తం ద్వేషకరమ్॥** వి.క. 43 పటలం.

| | | |
|---|---|---|
| పుష్పములు | తెలుపు | శాంతికరములు |
| పుష్పములు | పసుపు | బలవర్ధకములు |
| పుష్పములు | నలుపు | వశ్యకరములు |
| పుష్పములు | ఎరుపు | ద్వేషకరములుగా |

తెలియవలయును.

## 31. నిర్మాల్యములు

*ప్రాతరర్పితాని పుష్పాణి ఉద్వాసనాన్తే*
*రాత్ర్యన్తే వా నిర్మాల్యాని భవంతి॥*

**కా.జ్ఞా. 73 అధ్యా.**

ప్రాతఃకాలమునందు అర్చింపబడిన పుష్పములు ఉద్వాసనాంతమునందుగానీ రాత్రికాలపుచివరనగానీ నిర్మాల్యములు అగుచున్నవి.

## 32. సువర్ణ పుష్పములు

*సౌవర్ణం పుష్పం ఆభరణం మణిముక్తామయంచ*
*ప్రక్షాల్య ఆదాయ పునః పునః అర్పయేత్॥*

**వి.క. 42 పటలః.**

బంగారు పుష్పములు, ఆభరణములు, మణిముక్తామయములు వీటిని నీటితో కడిగి గ్రహించి తిరిగి తిరిగి వాటితో పరమాత్మని అర్చించవలయును.

సువర్ణ సంబంధ పుష్పాదులు ఆభరణములు నిర్మాల్యములు కావు.

## 33. యవనిక ఆవశ్యకత

*సూతాది ప్రతిలోమాశ్చ పాషండాః పతితాస్తథా*
*నాస్తికా భిన్నమర్యాదాః తథా వై వేదదూషకాః।*
*పాపరోగయుతాశ్చైవ తథైవ గురునిందకాః।*
*అర్చనం దేవదేవస్య హవిర్దానం చ వీక్షితుమ్*
*నార్హన్తి తస్మాత్కుర్వీత ద్వారం యవనికావృతమ్*
*మహాపాతకినాశ్చాపి సన్నిధిం పరివర్జయేత్*
*తస్మాద్ద్వారసమాయామం కుర్యాత్ యవనికాపటమ్॥*

క్రియ. **26, 23-26**

సూతాది ప్రతిలోములు పాషండులు పతితులు నాస్తికులు భిన్నమర్యాదస్థులు, వేదదూషకులు, పాపరోగులు, గురునిందకులు, పరమాత్మునియొక్క హవిర్నివేదనసమయమందు అర్చనా సమయమందు చూడకూడదు.

ద్వారమునకు యవనికను (తెరను) ఏర్పాటుచేసి వీరిదృష్టి ఆ యా సమయములందు పరమాత్మునిపై పడనీయక జాగరూకత వహించవలయును.

మహాపాతకుల దృష్టి సన్నిధియందు వర్జించవలయును. అందులకై యవనిక ద్వారసమపొడవుతో కల్పించవలయును.

## 34. శ్రీస్వరూపం

*తద్విష్ణోర్విభూతిః శ్రీఃసాచ నిత్యా ఆద్యన్తరహితా అవ్యక్తరూపిణీ ప్రమాణా అప్రమాణసాధారణీభూతా, విష్ణోః సంకల్పనానురూపా, నిత్యానందమయీ, మూలప్రకృతి రూపా శక్తిః॥*

వి.క. **80** పటలం

విష్ణువుయొక్క విభూతిశ్రీ. ఆమె నిత్యమైనది, ఆద్యన్తరహిత మైనది, అవ్యక్తరూపిణి, ప్రమాణమైనది, అప్రమాణసాధారణీభూత,

విష్ణువుయొక్క సంకల్పానురూప, నిత్యానందమయి, మూల ప్రకృతిరూప, శక్తి లక్ష్మి. అని శ్రీ స్వరూపము వర్ణించబడినది.

*లక్ష్మీః ప్రియతమావిష్ణోః సా హి నిత్యా అనపాయినీ*
*స్వసంకల్పానువిద్ధాచ శక్తిస్సర్వాత్మికా పరా।*
*ప్రకృతేర్మూలభూతా చ స్వామినీ జగతాం సతామ్॥*

ప్రకీ. 35, 360

విష్ణువునకు ప్రియమైనది లక్ష్మి. ఆమె నిత్య, అనపాయిని, సంకల్పానురూప, శక్తి, సర్వాత్మిక, పర, మూలభూత, జగత్తునకంతటికీ స్వామిని.

*సా ప్రకృతిః శ్రీరితి వ్యాఖ్యాతా*
*ప్రకృత్యైవ సర్వాణి కర్మాణి।*
*తస్మాత్ సర్వప్రయత్నేన*
*శ్రియం దేవీం పూజయేత్॥*

కా.జ్ఞా. 38 అధ్యా.

ఆ ప్రకృతి లక్ష్మీదేవిగా చెప్పబడినది. ఆప్రకృతినుండియే సర్వకర్మలు ఏర్పడినవి.

అందువలన సర్వప్రయత్నముతో ఆ శ్రీదేవిని పూజించవలయును.

## 35. లక్ష్మి రెండువిధములు

*సాప్రకృతిర్ద్వివిధా భవతి. అచేతనా చేతనాచేతి. అచేతనా పంచభూతైః మనోబుద్ధి అహంకారరూపైః అష్టధాభిన్నా. అన్యాజీవభూతా చేతనేతి॥*

వి.క. 80 పటలః

ప్రకృతి రెండు విధములు అచేతనము చేతనమని.

అచేతనమనగా మనోబుద్ధి అహంకారరూపములతో ఎనిమిది విధములుగా విభజింపబడింది.

జీవభూతమైనది చేతనము

ఇవ్విధముగా ప్రకృతి చేతనాచేతనముగా రెండువిధముల విభజింపబడినది.

*తత్ర శ్రీః ద్వివిధా రాజశ్రీ బ్రహ్మశ్రీశ్చేతి. ఆఢ్యమాత్రేణ యేనకేనచిత్ ఐశ్వర్యేణ యుక్తా రాజశ్రీరితి విజ్ఞాయతే.*

*బ్రహ్మశ్రీస్తు అగ్నిష్టోమాదీనాం సర్వేషాం క్రతూనాం అవాప్తిః అణిమాద్యైశ్వర్యసిద్ధిశ్చ .*

*బ్రాహ్మణైశ్చ పూజ్యా బ్రహ్మశ్రీరితి బ్రహ్మవాదినో వదన్తి॥*

కా.జ్ఞా. 7వ అధ్యాయం

శ్రీ రెండువిధములు రాజశ్రీ బ్రహ్మశ్రీ అని ఐశ్వర్యముచేత ఆర్భాటముతో కూడినది రాజశ్రీ.

అగ్నిష్టోమాది యాగములచేత సర్వ యజ్ఞములద్వారా ఆరాధింపబడి అణిమాది ఐశ్వర్యరూపమున పొందబడునది బ్రహ్మశ్రీ.

బ్రాహ్మణులచేత పూజింపబడునది బ్రహ్మశ్రీ అని బ్రహ్మవాదులు చెప్పుచున్నారు.






# VII. ఉత్సవఫలం

## 1. ఉత్సవదర్శనం

*దేవోత్సవే హరే ర్దృష్ట్యా వర్ధన్తే సర్వసంపదః॥*

సమూ. 56,49.

పరమాత్మునియొక్క ఉత్సవసమయమందు పరమాత్మ కరుణాదృష్టిచేత సర్వసంపదలు అభివృద్ధిచెందగలవు.

## 2. ఉత్సవదర్శనఫలం

*ఉత్సవే దేవేశం యే సేవన్తే తేసర్వే పదేపదే।*
*యజ్ఞఫలం లభేరన్నితి భృగ్వాదయోవదన్తి॥*

వి.క. 53 పటలం

ఉత్సవసమయమందు దేవేశుని ఎవరైతే సేవించుచున్నారో వారందరూ తప్పక యజ్ఞఫలమును పొందగలరని భృగ్వాది మహర్షులు చెప్పుచున్నారు.

## 3. శాంత్యుత్సవం

*ఉత్పాతేషు నిమిత్తేషు అనావృష్ట్యాదికేషు వై।*
*క్రియతే తత్రశాన్త్యర్థం సనిమిత్తోత్సవఃస్మృతః॥*

క్రియ. 14, 11-12.

అనావృష్టి మొదలైన నిమిత్తముల శాంతికై చేయు ఉత్సవము శాంత్యుత్సవముగా చెప్పబడుచున్నది.

## 4. ఉత్సవశబ్దార్థం

*సయజ్ఞో వో నరాన్ యుష్మానుత్తారయతి।*
*నిశ్చయం ఇతి వేదా వదన్తీతి స ఉత్సవ ఉదీర్యతే॥*

ప్రకీ. 35, 386.

స=యజ్ఞము

వ=నరులను తప్పక రక్షించుచున్నది.

యజ్ఞము నరులను తప్పక రక్షించుచున్నది అని వేదములు చెప్పుచున్నవి. కావున దానికి ఉత్సవము అనిపేరు ఏర్పడినది.

**5. కాలోత్సవం**

*మాసేతు యస్మిన్ కస్మింశ్చిత్ ప్రతిసంవత్సరం హరేః।*
*క్రియతే సమయేనైవ సవై కాలోత్సవో భవేత్ ॥*

క్రియ. 14,10.

ఏదో ఒక మాసమునందు ప్రతిసంవత్సరము శ్రీమహావిష్ణువునకు ఉత్సవము ఆచరించినట్లయితే అది కాలోత్సవము అగును.

**6. ఉత్సవఫలం**

*ఏవం యః కురుతే భక్త్యా తస్యకాయకృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి. దశపూర్వాన్ దశాపరాన్ ఆత్మానం చైకవింశతికం దేవైః అపి అనభిలక్ష్యం విష్ణోః పరమంపదం నయేత్. తద్గ్రామవాసినాం సర్వేషాం వ్యాధయః శాంతిం యాంతి. ప్రజావృద్ధిశ్చ భవతీతి విజ్ఞాయతే॥*

వి.క. 54 పటలః

*ఏతేన ఉత్సవేనైవ ప్రీణాతి భగవాన్ హరిః॥*

సమూ. 56, 71

శాస్త్రోక్తముగా ఎవరు భక్తితో ఉత్సవమును జరిపించుచున్నారో వారికి శరీరకృతపాపము తత్క్షణమే నశించుచున్నది.

పదితరములపూర్వము, పదితరముల తరువాత, ఆ యజమాని మొత్తం 21మంది దేవతలకు కూడా శక్యముకాని విష్ణుపదప్రాప్తిని సాధించుచున్నారు.

ఆ గ్రామప్రజలు సర్వవ్యాధులనుండి శాంతిని పొందుచున్నారు.

ప్రజావృద్ధి జరుగగలదు ఇది ఉత్సవఫలము.

శాస్త్రోక్త ఉత్సవ ఆచరణచేత పరమాత్ముడైన హరి సంతోషపడు చున్నాడు.

**7. ఉత్సవంలో పంచద్రవ్యములు**

*గేయం నృత్యంచ వాద్యంచ ధూపదీపౌ తథైవచ।*
*పంచద్రవ్యమితి ప్రాహుః తద్వినా స్యాత్ నచోత్సవః॥*

యజ్ఞ. **47 ,124**

గేయము, నృత్యము, వాద్యము, ధూపము దీపము ఇవి పంచద్రవ్యములు. ఈ ద్రవ్యములు లేకుండా ఉత్సవం చేయకూడదు.

**8. ధ్వజస్థగరుడ నివేదన – సంతానప్రాప్తి**

*ధ్వజస్థ గరుడస్య నివేదితమన్నం పిండం కృత్వా స్త్రియః*
*పుత్రకామిన్యః, పురుషాః తత్కామాః*
*అశ్నీయుః తాః బలారోగ్యయుక్తం ఆయుష్మన్తం*
*పుత్రం ప్రసూయేయుః॥*

వి.క. **51** పటలం

ధ్వజపటమునందలి గరుడునకు నివేదించబడిన అన్నమును పిండముగా చేసుకొని ఏ స్త్రీలు, పురుషులు సంతానవంతులై, తినుచున్నారో, వారు బల – ఆరోగ్య – ఆయుర్దాయవంతుడైన పుత్రుని పొందుచున్నారు.

★ ★ ★

# VIII. ప్రాయశ్చిత్తములు

## 1. ప్రాయశ్చిత్త పదార్థం

*ప్రాయోదోష సముత్పత్తిః చిత్తస్య నిరాసనమ్.*
*తస్యదోషస్య సంధానం ప్రాయశ్చిత్త మితీరితమ్॥*

క్రియ. 20, 1-2

ప్రాయమనగా దోషములు పుట్టుట. చిత్తమనగా దోషముల యొక్క నిరాకరణ. దోషములను పోగొట్టటమే ప్రాయశ్చిత్తమని ప్రాయశ్చిత్త పదార్థము చెప్పబడుచున్నది.

## 2. అద్భుతములు

*నరాణాం పాపబాహుల్యాత్ అపరాథ బాహుల్యాచ్చదేవాః*
*సృజంతి అద్భుతాని తేషు దృష్టేషు సద్యశ్శాన్తింకుర్యాత్॥*

వి.క. 72 పటలం

జనులయొక్క పాపబాహుళ్యముచేత అపరాధబాహుళ్యము చేత దేవతలు అద్భుతములను సృజించుచున్నారు. ఆ అద్భుతములను దర్శించిన వెంటనే శాన్తి చేయవలయును.

(అద్భుతములు - గ్రహయుద్ధ, అనావృష్టి, మొదలగునవి. రాత్రికాలమందు ఇంద్రచాపదర్శనం, ఉల్కాపాతాదులు, దేశకాల స్వభావాదుల విరుద్ధములు జరుగుట)

## 3. ప్రాయశ్చిత్త నిమిత్తములు

*నశక్యం విధివత్కర్తుం బ్రహ్మాద్యైరపి పూజనం।*
*న్యూనాతిరిక్త వ్యాఘాత దోషహీనం జగత్పతే॥*

వి.క. 74 పటలం

శాస్త్రోక్తముగా అర్చించుట బ్రహ్మాదిదేవతలకు కూడా శక్యము కాదు. మానవులచే చేయబడు అర్చన దోషప్రదమైనదే.

*అశక్యం విధివత్కర్తుం బ్రహ్మాద్యైరపి పూజనం*
*కింవా తత్ర మనుష్యాణాం అవ్యవస్థితచేతసామ్*
*విషయాసక్త చిత్తానాం ఇంద్రియాహృతచేతసామ్*
*అజ్ఞాతానాంచ దోషాణాం అర్చనాదిషు కర్మసు*
*జ్ఞాత్వాచానాదృతానాంచ మోహాల్లోభాత్ప్రమాదతః*
*తత్తద్దోష శాన్త్యర్థం కుర్యాత్ సామాన్యనిష్కృతిమ్॥*

క్రియ. **31, 1-4**

అవ్యవస్థిత చేతసులు విషయాసక్తచిత్తులు ఇంద్రియలోలులు అయిన మానవులచే చేయబడు అర్చనాదికర్మలందు దోషములు మోహ లోభములచే కూడి యుండును.

ఆ దోషముల నివారణకై ప్రాయశ్చిత్తములు ఆవశ్యకములు.

*ద్రవ్యహీనే ద్రవ్యహానిః క్రియాహీనే క్రియాహానిః*
*మంత్రహీనే తత్సర్వం నశ్యతి*

కా.జ్ఞా. **95** అధ్యాయం

ద్రవ్యహీనము చేత ద్రవ్యహాని కలుగును. క్రియాహీనము చేత క్రియహాని సంభవించును. మంత్రహీనము చేత సర్వము నశించుచున్నది.

ప్రాయశ్చిత్తకర్మలు పై దోషముల నివారణకై అవశ్యము చేయవలయును.

★ ★ ★

# IX. అపచారములు

## 1. అపచారములు

*అపచారస్తథా విష్ణోః ద్వాత్రింశత్ పరికీర్తితాః*
*యానైర్వాపాదుకైర్వాపి గమనం భగవద్గృహే।*
*దేవోత్సవాద్యసేవా చ అప్రమాణంచ తదగ్రతః*
*ఏకహస్త ప్రణామశ్చ తత్పురస్తాత్ ప్రదక్షిణమ్।*
*ఉచ్ఛిష్టే చైవ చాశౌచే భగవద్వందనాదికమ్*
*పాదప్రసారణంచాఽగ్రేతథా పర్యంకబంధనమ్*
*శయనం భోజనం చైవ ముదాభాషణమేవచ*
*ఉచ్చైర్భాషా వృథా జల్పో రోదనాద్యంచ విగ్రహః।*
*నిగ్రహోఽనుగ్రహశ్చైవ స్త్రీషు సాకూతభాషణమ్*
*అశ్లీలకథనం చైవ అప్యధోవాయువిమోక్షణమ్।*
*కంబలావరణంచైవ పరనిందా పరస్తుతిః।*
*శక్తౌ గౌణోపచారశ్చ అప్యనివేదితభక్షణమ్*
*తత్తత్కాలోద్భవానాంచ ఫలాదీనామనర్పణమ్।*
*వినియుక్తావశిష్టస్య ప్రదానం వ్యంజనాదిషు*
*పృష్ఠీకృత్యాసనంచైవ పరేషామభివందనమ్।*
*గురౌమౌనం నిజస్తోత్రం దేవతానిందనం తథా*
*అపచారాంస్తు వివిధాన్ ఈదృశాన్ పరివర్జయేత్॥*

ప్రకీ. 36, 1-9.

అపచారములు 32గా చెప్పబడినవి. అవి

వాహనముద్వారాగానీ, పాదరక్షలు ధరించిగానీ ఆలయము ప్రవేశించుట.

ఉత్సవాదులందు పరమాత్మునికి నమస్కరించకుండుట, సేవించకుండుట.

ఒకే చేతితో ప్రణామముచేయుట.

ఎదురుగా నిలబడి ప్రదక్షిణముచేయుట.

ఆశౌచమందు అశుచిగా పరమాత్మునిగూర్చి నమస్కరించుట.

పరమాత్మునకు ఎదురుగా పాదములు ప్రసరింపచేయుట.

మంచంమీద కూర్చుండుట.

ఆలయంలో శయనము, భోజనము, వృథాభాషణము చేయుట.

(బిగ్గరగా మాట్లాడుట, అప్రసంగము, రోదనము, నిగ్రహము, అనుగ్రహము, స్త్రీలతో అశ్లీలభాషణము చేయుట.)

అపానవాయువు విడుచుట.

దుప్పటి కప్పుకొనుట, పరనింద, పరస్తుతి చేయుట.

శక్తి ఉన్నప్పటికీ తక్కువ ఉపచారములు చేయుట.

నివేదన చేయకుండా భక్షించుట.

ఫలములను సమర్పించకుండుట.

శేషించిన వ్యంజనాదులను భగవంతునికి సమర్పించుట.

భగవంతునకు వీపుచూపించుట.

ఇతరులకు అభివాదము చేయుట.

గురువులయందు మౌనము, స్తోత్రము, దేవతానిందచేయుట.

ఇవి అపచారములుగా చెప్పబడినవి. వీటిని ఆలయములో విడిచిపెట్టవలయును.

*నహిదేవగృహం గత్వా వివదేత నరఃక్వచిత్*
*నతత్ స్థానం వివాదస్య తస్మాత్తం దూరతస్త్యజేత్॥*

ప్రకీ. **36, 468.**

దేవాలయమునకు వెళ్లి మానవుడు వివాదములు పెట్టుకొన కూడదు. వివాదములకు ఆలయము స్థానము కాదు.

*రాగాద్యపేతం హృదయం వాగదుష్టా అనృతాదినా।*
*హింసాదిరహితః కాయః కేశవారాధనే త్రయమ్॥*

ప్రకీ. **36, 470.**

రాగాదులు లేని హృదయము, సత్యమైనవాక్కు, హింసాది రహితశరీరము, ఈ మూడు కేశవారాధనయందు ముఖ్యములైనవి.

*మంత్రేషు జీవికాభావం హింసాభావం మఖేషుచ।*
*పూజకేషు చ పూజాయాం నీరసం భావమేతిసః*
*సర్వధా నిందితవ్యోహి జీవితం తస్య నిష్ఫలమ్ ॥*

ప్రకీ. **36, 635.**

మంత్రములందు స్వల్పభావన,
యజ్ఞములందు హింసాభావన,

పూజకులయందు, పూజయందు నీరసభావం ఎవరు కలిగి ఉన్నారో వారు నిందించి తగినవారు. మరియు వారిజీవితము నిష్ఫలము.



# అకారాది విషయసూచిక

★ ★ ★

T T D. Religious Publications Series No. [illegible]

Price Rs.10/-





చక్షుషః ప్రీతికరణాత్
మనసో హృదయస్యచ।
ప్రీత్యా సంజాయతే భక్తిః
భక్తస్య సులభోహరిః॥

క్రియాధికారః

---

వైఖానసం మహాశాస్త్రం సర్వవేదేషూద్ధృతం
సర్వవేదార్థ సారభూతం అప్రతర్క్యం అనిందితం।
వైదికైః ఉపసేవితం విష్ణోః ఆరాధనాయ
శాబ్దం ప్రమాణ మవలంబ్య విష్ణునా విఖనస ఉక్తమ్॥

విమానార్చనాకల్పః

---

Printed and Published by Sri A.P.V.N.SARMA, I.A.S., Executive Officer,
Tirumala Tirupati Devasthanams and Printed at T.T.D. Press, Tirupati.

T T D. Religious Publications Series No. [illegible]

Price Rs.10/-





చక్షుషః ప్రీతికరణాత్
మనసో హృదయస్యచ।
ప్రీత్యా సంజాయతే భక్తిః
భక్తస్య సులభోహరిః॥

క్రియాధికారః

---

వైఖానసం మహాశాస్త్రం సర్వవేదేషూద్ధృతం
సర్వవేదార్థ సారభూతం అప్రతర్క్యం అనిందితం।
వైదికైః ఉపసేవితం విష్ణోః ఆరాధనాయ
శాబ్దం ప్రమాణ మవలంబ్య విష్ణునా విఖనస ఉక్తమ్॥

విమానార్చనాకల్పః

---

Printed and Published by Sri A.P.V.N.SARMA, I.A.S., Executive Officer,
Tirumala Tirupati Devasthanams and Printed at T.T.D. Press, Tirupati.